# పరిచయం



పేరు : వారణాసి సూర్యకుమారి

జననం : 1941

తల్లిదండ్రులు : భాగవతి సుబ్బారావు గారు, సత్యవతి గారు

జన్మస్థలం : ద్రాక్షారామం

భర్త : శ్రీ వారణాసి లక్ష్మీజయప్రదన్(మేజర్)

పిల్లలు : నలుగురు

పెద్ద అమ్మాయి డా॥ శోభ - పెద్దల్లుడు - డా॥ బి.డి.సి.ఎన్. ప్రసాద్

చిన్న అమ్మాయి డా॥ శైలజ - చిన్నల్లుడు - డా॥ ఎస్.వి. రమణ

పెద్ద అబ్బాయి డా॥ పినాకపాణి - కోడలు - డా॥ నాగలక్ష్మి

చిన్న అబ్బాయి డా॥ చక్రపాణి - కోడలు - డా॥ శ్రీదేవి

మనుమలు : వంశీ, వరుణ్

మనుమరాండ్రు : నీలోత్పల, మనోజ్ఞ, వర్షిణి, హర్షిణి

రచనలు : గోవింద శతకము, శ్రీరామ కథాసుధ, సూర్యకిరణాలు, కవితా రామం (పద్యకవితలు), కథల సంపుటి, 'మానినీ మానసం', (ముద్రితములు), నవలలు (అముద్రితములు)

పురస్కారం : 'ఆంధ్రసారస్వత సమితి' ఉగాది పురస్కారం, పద్యరచనకు 2009లో 'సాహితీ మిత్రుల సంస్థ' తరువున మిత్రులందరు 'కొత్తపూలు' కవితల సంకలనం అంకితం యివ్వడం.

'మన బందరు' పుస్తకమునకు గౌరవ సంపాదకత్వం వహించుట.

ఆకాంక్ష : ఇంకా ఎన్నో ఎన్నో (వ్రాయాలని)

1. ఆంధ్ర సారస్వత సమితి, సాహితీ మిత్రులు, ఉదయ నడక మండలిలో శాశ్వత సభ్యత్వం.
2. ఉదయ నడక మహిళా విభాగం ప్రెసిడెంటుగా, మహిళా మండలిలో వైస్ ప్రెసిడెంట్‌గా సేవా కార్యక్రమాలు నిర్వహించడం.

చంద్రకళా ప్రెస్ : 9848411703, 222446

# శ్రీ వేణునాదము

(ద్విపద కావ్యము)



వారణాసి సూర్యకుమారి

# శ్రీ వేణునాదము

(ద్విపదకావ్యము)



వారణాసి సూర్యకుమారి

# శ్రీ వేణునాదము

(ద్విపదకావ్యము)

రచన :

**వారణాసి సూర్యకుమారి**

ప్రథమ ముద్రణ :

**మే 2009**

మూల్యం : **అమూల్యం**



సాహితీ మిత్రులు : **ప్రచురణ నెం. 67**

డి.టి.పి.

చంద్రకళా ప్రెస్

మచిలీపట్నం - 2

సెల్ : 9848411703, 222446, 252333

రచయిత్రి అడ్రస్ :

వారణాసి సూర్యకుమారి

20/562/3,

పరాసుపేట, మచిలీపట్నం - 1

ఫోన్ : 08672 - 215741



ఆచార్య వి.వి. శోభ

ఆంధ్రాయూనివర్శిటీ ఇంజనీరింగు కాలేజీలో మేథమేటిక్స్ ప్రొఫెసరుగా ఉన్న మా పెద్దమ్మాయి డా॥ వి.వి. శోభ తన అస్వస్థత కూడా లెక్కచెయ్యకుండా 'శ్రీ వేణునాదం' పుస్తకం పబ్లిష్ చేయించే బాధ్యత నాది అంటూ డి.టి.పి. చేయించి తీరా పుస్తకం రూపుదిద్దుకునే సమయానికి తన రూపమే మాయమైనా అదృశ్యరూపంలో 'వేణునాదం' వినగలదని ఆశిస్తూ, తన ఆత్మశాంతికై ఆ కృష్ణభగవానుని ప్రార్థిస్తూ...

- వారణాసి సూర్యకుమారి

## సూర్య ప్రవంతిక

తొలి తెలుగు ఛందస్సులలో ద్విపద ఒకటి. పాల్కురికి సోమనాథుడు రంగనాథుడు వంటి వారు మొత్తం కావ్యములను ద్విపదలోనే రచించారు. ద్విపద ద్విపథములకు దారి చూపుతుందని విశ్వసించారు. మార్గకవులు వృత్తములనాశ్రయిస్తే దేశకవులు ద్విపదను ఎన్నుకోవటం గమనార్హం.

శ్రీమతి వారణాసి సూర్యకుమారి రచించిన వేణుగానము దీర్ఘ కవిత. నిర్దిష్టమైన వస్తువు, సంవిధానమును నిర్దేశించకుండా భక్తి ప్రధానముగా భావకవిత వ్రాసినట్లున్నది. ఆనాడు కూడ అంబరీషుడు, గజేంద్రుడు వంటి సంఘటనల ప్రసక్తి ఉన్నా అవి అనుషంగికములే - ఆద్యంతము కృష్ణభక్తి ప్రవహించటం ఇందలి విశిష్టత. మోహన వంశి, అన్నా శిఖిపింఛము అన్నా కృష్ణ సంకేతములు (సింబల్స్). ఈ రచన పేరు వేణుగానము - రచయిత్రి వారణాసి వంశహారాకారరాకా చంద్రిక - పేరు సూర్యకుమారి. ఇందులో సూర్యతేజము కాదు చంద్రుని చల్లదనమున్నది. సూర్యసుత యని యమునకు పేరు . ఈ కవిత యమునా తరంగిణి వలె పాఠకుల మనస్సులకు ఊయలలూపును. ఈమెకు ఛందస్సుపై మంచి పట్టు కుదు. ఇది సాధనా బలము. వారణాసి వారు మొదటి నుండి వేదపండితులు. తర్వాత కవులు అయినారు. ఈ రచనలో ఒక క్రమమున్నది. బాలకృష్ణుని లీలలు నుండి నరకాసురవధ, గోపికా గీతాల వరకు భాగవతములో చెప్పిన ప్రధాన గాథలుస్మృతించేటట్లు ఒక క్రమంలో ద్విపదసాగింది. ఈమెకు భారతకృష్ణుని కన్నా భాగవత కృష్ణుడే ఇష్టము. ఇది స్పష్టము. ఇందులో అంతర్లీనంగా మధుర భక్తి ఉంది. శ్రవణంకీర్తనం విష్ణోస్మరణం పాదసేవనా అని వరుసగా నవవిధ భక్తులకు చెప్పారు. వాటిని సూర్యకుమారి గారు ఉదహరించినారు. శ్రవణకీర్తనములు శ్రద్ధగజేయ - భవబంధనములు వీడి భగవానుజేరు. భాగవతపురాణసారాంశమిదియె.

సూర్యకుమారి గారు ధన్యురాలు. ద్విపద మూర్ధన్యురాలు. జీవేమ శరదశ్శతం.

సర్వధారి భాద్రపద
సెప్టెంబరు - 2008
హైదరాబాదు - 13

- ప్రొఫెసర్. ముదిగొండ శివప్రసాద్

## చక్కని ప్రణాళికాబద్ధమైన రచన

శ్రీ వేణునాదం" పేరుతో వారణాసి సూర్యకుమారి గారు రాసిన ద్విపదకావ్యం కవయిత్రి భక్తిభావానికి స్పష్టమైన నిదర్శనం. సూర్యకుమారి గారితో ఈ కావ్య రచన చేయించిన వారు వారి పెద్దబ్బాయి డా॥ పినాకపాణిగారు. ఈ విషయంలో పినాకపాణి గారిని ముందుగా అభినందించాలి. ఎంతరాసినా మళ్లీ మళ్లీ దిద్దుకుంటూ ఇంకా బాగా కావ్యం రావాలనే తపనతో కృషిచేసిన కవయిత్రి సూర్యకుమారి గారిని ఎంత అభినందించినా అది చాలదు. వృద్ధాప్యదశలో వారి. కవిత్వాభిరుచి, దైవభక్తి సారస్వత ప్రేమ మనం మెచ్చుకోకుండా ఉండలేము.

"శ్రీ వేణునాదం" అనే ఈ ద్విపద కావ్యం సూర్యకుమారి గారు చక్కని ప్రణాళికతో రచించారు. శ్రీకృష్ణ జననం, శ్రీకృష్ణుణ్ణి రేపల్లెకు చేర్చటం, చిన్ని కృష్ణుడు, బాల్యం-తల్లీ-బిడ్డ, శ్రీకృష్ణ లీలలు, కాళీయమర్దనం, శ్రీకృష్ణుని లీలావినోదం, గోపికలు-కాత్యాయినీ వ్రతం, హరి పరీక్ష, శ్రీకృష్ణ లీలామృతం, రుక్మిణీ కళ్యాణం, సత్యభామా పరిణయం, ఇల్లాళ్లు-ముచ్చట్లు, గజేంద్రుని గాథ, భక్త ప్రహ్లాదుడు, శ్రీకృష్ణుని చెలిమి-కలిమి-బలిమి, నరకాసురవధ, శ్రీకృష్ణతత్వం వగైరా ఉపశీర్షికలతో ఈ ద్విపద కావ్యం రచించారు. అడుగడుగునా ఈ కావ్యంలో సూర్యకుమారి గారి భక్తి భావం, కవిత్వప్రేమ పాఠకుల్ని అద్భుతంగా అలరిస్తాయి. సూర్యకుమారి గారి మా "సాహితీ మిత్రులు" సంస్థ కార్యవర్గ సభ్యురాలుగా కూడా ఎంతో విశేషమైన సహకారం అందిస్తున్నారు. ఈ "శ్రీ వేణునాదం" ద్విపద కావ్యాన్ని మా మచిలీపట్టణం, "సాహితీ మిత్రులు" సంస్థ ప్రచురణగా ప్రచురిస్తున్నందుకు కూడా సంస్థ పక్షాన వారణాసి సూర్యకుమారి గారికి హృదయ పూర్వకమైన శుభాకాంక్షలు కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

- డా. రావి రంగారావు
వ్యవస్థాపక అధ్యక్షులు,
సాహితీ మిత్రులు - మచిలీపట్నం

## అభినందనలతో..

"శ్రీ వేణునాదము" ద్విపదకావ్యము. ద్విపదలో మూడు ఇంద్రగణములు చివరలో సూర్యగణము ఉంటాయి. మూడవ గణాదిన యతి ఉంటుంది. రెండు పాదములే ఉన్నందున "ద్విపద" అంటారు. పాల్కురికి సోమనాధుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్ర అను రెండు ద్విపదకావ్యాలను రచించాడు. "ఉరుతర గద్యపద్యోక్తులకంటె - సరసమైపరగిన జానుతెనుంగు- చర్చింపగా సర్వ సామాన్యమగుట-గూర్చెద ద్విపదలు కోర్కెదైవార" అని బసవపురాణంలో ఆయన చెప్పుకున్నాడు. "ప్రాసమైనను యతిపై వడియైన-దేసిగా నిలిపి యాదిప్రాసని యతి - దప్పకుండగ ద్విపదలు రచియింతు" అని కూడా సోమనాధుడు చెప్పుకున్నాడు. ద్విపద రచన యొక్క ప్రయోజనమేమిటో ఈ మాటలవల్ల మనకు స్పష్టం అవుతుంది.

శ్రీమతి వారణాసి సూర్యకుమారి గారు "శ్రీ వేణునాదము"లో తు.చ. తప్పకుండా ద్విపద లక్షణాలను పాటించారు. కవయిత్రి తనను వేణువుగా సంభావించుకుని, "కమలాక్షునకు నేను కర భూషణముగ అమరుటదృష్టమ్ము" అంటారు. "వేణువు నాపేరు వేలరాగములు బాణీలు వినిపింతు భాగవతమ్ము" అంటూ ముందుకు సాగిపోతారు. తన కావ్య పరమార్థాన్ని వివరిస్తూ "ఏ లీల శ్రీకృష్ణుడేలెనో యిలను, ఆ లీలలెరిగింతు అవలీల" అంటారు. భాగవతంలోకి అడుగిడుతూ "వ్యాసుడు శుకమౌని వరునకు తెలుప-వ్రాసెను శ్రీ భాగవతమును తొలుత" అని చెపుతూ పరీక్షిత్తునకు మరల శుక మహర్షి భాగవత కథను వివరించిన విషయాన్ని కూడా ముచ్చటిస్తారు. "ఆదినగ్రజునిగ ఆది శేషుండు మోదమున బలరామునిగా జన్మించె - బలరామనామమ్ము బరగనగ్రజుని అలరించె విష్ణువు అనుజుడై పిదప" అంటూ శ్రీకృష్ణ బలరాముల జన్మాన్ని వివరిస్తారు. రేపల్లెకు శిశువుతో వెడలిన వసుదేవునకు ప్రకృతి ఎలా సహకరించిందో కవయిత్రి వర్ణించిన తీరు హృద్యంగా ఉంది.

శ్రావణ మేఘాలు సంబరపడుచు
ఆవరించెను నాడు అంబరవీథి
తరువులు విరులూనితరుణులు తమరి
కురులందు విరులను కూర్చినట్లుండె

***

గగనమ్ము తారలు కలకలలాడె

***

పవనుండు వీచనుపల్ల వకరము
అవనిని చిందెను అందముకరము

"ఆ యశోదాదేవి హస్తాబ్జములనుతోయజనేత్రుండు తుమ్మెద యయ్యె" అంటారు కవయిత్రి. ఎంత చక్కని ఊహ! ఆ నల్లని వానికి పేరు ఏమిపెట్టాలి అని సందేహం వచ్చింది. "సిరిగలవాడైన శ్రీహరి యగున? శిరమున గంగతో శివుడునతగున? ఇంద్రుడు! చంద్రుడు! ఇనుడౌన! ఇతడు" అని "సంద్రమంత" సందేహం కలిగిందట!

ఉనికి యర్థమ్మది ఉండెను కృషికి, అనగ 'ణ'కారము అనందమగును కావున కృష్ణగ గర్గుడుపెట్టె" అంటూ కృష్ణ నామంలోని ఔచిత్యాన్ని పరమార్థాన్ని కవయిత్రి స్పష్టంచేశారు.

ఇక పసిపిల్లవాని చేష్టలను వర్ణిస్తూన్నపుడు ఆమె మాతృమూర్తిగా కలంలో ప్రత్యక్షమయ్యారు.

"అల్లరితనమున ఆట్లాడుబిడ్డ
చల్లగ హారాలు సవరించుచుండు
గడగడమని పాలు గళమునందుంచి
మెడలోన సూత్రాలు మెలిపెట్టుచుండు
పిల్లవాడుక్కిరి బిక్కిరగునని
తల్లడిల్లుచు తల్లి తలమీదనూదు

తుంటరితనమున ధూయనియుమ్ము
దొంగవేషమ్ముల దోబూచులాడి
కొంగుచాటున దూరి కొంటెగానవ్వు

ఇక పిల్లవాడు పెద్దవుతున్న కొద్దీ తెలుగు ఇళ్ళలో ఎలా సంబరంగా జరుపుకుంటారో కవయిత్రి హృద్యంగా వర్ణించారు.

బోరగిల బడిన బొబ్బట్లువండు
నోరనవ్వినపంచు నువ్వుయుండలను
గడపలు దాటగ గారెలు వండు
అడుగులకును అమ్మ అరిసెలువేయు

శ్రీకృష్ణ లీలలను అభివర్ణిస్తూ 'వెన్నదొంగ' అని శ్రీకృష్ణుడికి పేరు వచ్చిందని చెప్తూ, 'తోటివారికి వెన్న తృప్తిగా పెట్టి చాటిచెప్పును తానె సాటితనకని, సురలకు చక్కగ సుధనంతపంచి, హరి జూడనవనీత హరుడుగమిగిలె అంటారు.

శ్రీకృష్ణుని బంధించటానికి తాడు తెస్తే "బుజ్జి నడుము కట్టు పూర్తిగాకుండె, రజ్జువు చాలక రభసగా నుండె ఎంతత్రాడును తెచ్చి ఎటులకట్టినను సుంతైన కొరవడు చుండె నా త్రాడు". చివరకు యశోద "బంధింపబూనియు బ్రతిమాలుచుంటి, సంధించబోకుమీ సత్యాగ్రహమ్ము. కట్టుబడగదయ్య కరుణించి నన్ను పట్టు విడిచి నీవు పట్టుబడమనె". అపుడు కృష్ణుడు యశోదకు చిక్కాడు. కాళీయ సర్పాన్ని అణచిన విధాన్ని కవయిత్రి మనోజ్ఞంగా చిత్రించారు.

తరలగ సర్పముదర్పము వదల
శిరమున కృష్ణుడు చిందులు వేసి
శ్రీహరి పదములు శ్రీలక్ష్మియొత్తు
ఆ హరి పదముద్రలహి పైన బడియె
క్షీర సాగరకన్యకేలందువేళ
క్షీర వారధి కడిగిన పాదములవి
శ్రీపాదములె జేసె శిలనహల్యగను
ఆ పాదముల గంగ ఆవిర్భవించె

***

అట్టి పాదమ్ములు అతి పుణ్యఫలము
గట్టి ముద్రను వేసి కరుణించె ఫణిని

"గోపికా వస్త్రాపహరణం"లోని వేదాంత తత్త్వాన్ని అద్భుతంగా చెప్పారు కవయిత్రి.

కోకలు హరియించి గోపికలనటు
సాకారము చేసి సంస్కరించె హరి
తమ యున్కి లేదనిదైవమె దిక్కు
తమ కంచుతలచుటె తగునని తెలిపె

వేణునాదాన్ని గురించి వివరిస్తూ :

కామము క్రోధాధి కారమ సూయ
ఈమహద్వేషము ఈర్ష్యాదులారు
ఆరు రంధ్రములున్న ఆవేణువూది
ఆరుశత్రువులను అరికట్టమనును
తమ మనములనుంచి తన యధీనమున
మనసార గొలిచిన మన్నించు హరియు"

అంటారు.

ఇంక రుక్మిణీ కళ్యాణము, సత్యభామా పరిణయం, గజేంద్రుని గాధ, భక్త ప్రహ్లోదుడు, కుచేలోపాఖ్యానము, నరకాసుర వధ, ఇలా ఎన్నో కథలను చెప్తూ శ్రీకృష్ణుని అలౌకిక తత్త్వాన్ని వివరించి చూపారు. చివరిలో శ్రీ కృష్ణ తత్త్వాన్ని వివరిస్తూ :

"ఆత్మ స్వరూపమెయగును దేహమ్ము
ఆత్మయు పరమాత్మ అగు నొక్కటిగను
కృష్ణుడు సృష్టికి నెల్లకారకుడు
కృష్ణ స్మరణమున కృప నొందవలెను"

అని ప్రబోధిస్తారు.

శ్రీమతి వారణాసి సూర్యకుమారి గారు ఎంతటి భావుకురాలో భక్తితత్పరులో ఈ కావ్యాన్ని చదివితే తెలుస్తుంది. కొన్ని కొన్ని శబ్ద చిత్రాలు ఆమె కల్పనాశక్తికి ప్రతీకలుగా మనకు ఈ కావ్యంలో కన్పిస్తాయి. "పూలగుత్తినికేళ పూర్వకమ్ముగను కేలనెత్తు విధము గిరినెత్తె హరియు" "బానవంటి కడుపు బరువైన తనువు దానవియరచుచు ధరణిపై యొరిగి వాలిన యూడల వటవృక్షమట్లు కాలిన సౌధమ్ము రాశిని బోలి" - ఇందుకు చక్కని ఉదాహరణలు. ఇక అర్థాలంకారాలనేకాక శబ్దాలంకారాలను కూడా కవయిత్రి చక్కగా ప్రయోగించి చూపారు. "బుడిబుడి నడకలు బుడతడు నేర్చి, తడబడి వేయును తప్పటడుగులు, గడబిడనడుగిడు కడువడివడిని పడిపడి నడచచు బహు సవ్వడి నిడు"

ఒక ప్రతిభా సంపన్నురాలైన కవయిత్రి కలం నుండి వెలువడిన హృద్యమైన కావ్యం ఇది! అభినందనలనందిద్దాం! రండి!

- డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

## ఆశీస్సు

తే॥గీ॥ పద్యకావ్యమ్ములను వ్రాసి వ్యాసములను
వ్రాసిగేయమ్ములను వ్రాసి వాసిగన్న
వారణాసి సూర్యకుమారి మారలుగాక
ఆయురారోగ్యములతోడననవరతము.

- శ్రీ దుగ్గిరాల రామారావు

## అంకితం



కృపనేలు దైవమా । కృష్ణయ్యనీవు!
కృపను వ్రాయించి తీకృతిని నాచేత
విశ్వమంతటికిని విభుడవునీవె
విశ్వకల్యాణము విధిగజూచెదవు
ద్విపదకావ్యముగ నీ దివ్యచరిత్ర
విపులమ్ముగా వ్రాయవేడుకకలిగె
ఆద్యంతములు లేని అపురూపగాథ
సాధ్యంబె లిఖియించ? సర్వేశ ! నాకు
కర్త, కర్మ, క్రియకారక! కృతికి
భర్తవునీవె! యీభారమ్మునీదె
ఆశను దీర్చితివ అబలను నేను
ఆశీర్వదించుము, అక్షయంబుగను
శ్రీ వేణు నాదము స్వీకరించుమని
నేవేడు కొనుచుంటి నినుదేవదేవ!
శ్రద్ధగ, దీనిని చదువు వారలకు
సిద్ధింపజేయుము, సిరులునుయశము.

భక్తిప్రపత్తులతో
వారణాసి సూర్యకుమారి

# అంతరంగ తరంగాలు

శ్రీరామునిదయ చేతను, నారూఢిగసకలజనులు నౌరాయనగ ........... నోరూరగ చవులు బుట్ట " అని సుమతీశతక కారుడునుడివినట్లు "(శ్రీరామకథాసుధ" పద్యకావ్యము) అంతకాకపోయినాకొంతై నాతృప్తికలు గువిధంగా పంచడమైంది. నాకులభించిన సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలనే సదుద్దేశంతో సత్కాలక్షేపంగా కలం పట్టి ఆసర్వాంతర్యామి శ్రీరామచంద్రుని చరితమును 'శ్రీరామకథాసుధ' గా నారచన కలకాలం నిలిచియుండి పోవాలనే పేరాశతో వ్రాయడం జరిగింది. నా అదృష్టము వల్ల సహస్రావధాని శ్రీ గరిక పాటి నరసింహారావు గారిచే ఆవిష్కరణ జరిగింది ఆదైవకృపవల్ల కలము, కరము ఊరికేఉండలేక పోతూంటే కథలు, కవితలు వ్రాయడం, అవి పుస్తకాలరూపంలోకి తేవడం జరిగింది. కొంతమంది సాహితీ మిత్రులు ।కొత్తపూలు। అనే తమ అపురూపమైనగేయ సంపుటిని నాకు ।అంకితం। యిచ్చారు అది నా సాహిత్య కృషికి భగవంతుడు మెచ్చిన వరముగా నమ్ముతున్నాను, నా జీవితంలో మరుపురాని మధుర ఘట్టముగా బావించుచున్నాను.

ఈచరాచరసర్వ జగత్తును అదృశ్యరూపంలో సృష్టి, స్థితి, లయకారకుడైన దైవమేనడిపిస్తున్నాడు కద ఆజగన్నాటక సూత్రధారిని శ్రీకృష్ణావతారునిగా ఆయనలీలావిశేషములను రాయగలిగితే నాజన్మధన్యమైనట్లే అనిపించింది. అందుకే 'భాగవతము' ను 'ద్విపదకావ్యము' గా రూపొందించాలనే సత్సంకల్పంకలిగింది.

" శ్రీకైవల్యపథమ్ము చేరుటకు నైచింతించెదన్" అంటూపోతనామాత్యులు "శ్రీమద్భాగవతము" సంస్కృతమునుంచి తెలుగు భాషలో వ్రాయ సంకల్పించారు, నిజానికి చరమాంకంలో ప్రతివ్యక్తి కోరుకోదగినది 'చక్రి' చరణసన్నిధియేకద! అందుకే ధృఢసంకల్పంతో రచనకు సాహసించాను. దైవబలంతోడైంది, విఘ్ననాయకునికృప, చదువుల తల్లి చల్లని చూపు నా పైప్రసరించ బడడంతో అనుకున్నది నెరవేర్చగలిగాను.

భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనదమ్మి చూలికైన
విబుధ జనుల వలన విన్నంతకన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు

అన్నారు ఆమహాకవిపోతనగారు, అటువంటి మహాపండితులే అలాసెలవిచ్చినపుడు నావంటి అజ్ఞానురాలికి సాధ్యమయేపనియా? కానీ ధైర్యే సాహసేలక్ష్మి! సరస్వతీ! అని ప్రారంభించాను.

"పలికెడిది భాగవతమట! పలికించు విభుండురామ భద్రుండట" అని కూడా పోతనగారు పలికియున్నారు. అందుకే ఆ రామభద్రుడే నాచేత వ్రాయించాడని నాప్రగాఢవిశ్వాసం.

చాలాపరిమితమైన జ్ఞానముతో పాండిత్యమసలు లేని నాతో ఆ భగవంతుడు ఎందుకు వ్రాయించాలని అనుకున్నాడో!

ఈ "వేణునాదము" ప్రారంభదశలో విద్వద్విమర్శలు ఎదుర్కోవలసివస్తుందేమో అని చాలా సందేహం కల్గింది. దేహంకంపించింది, కాని మనోబలం జయించింది, కలాన్ని కదిలించింది. దైవబలం పూర్తి చేయించింది, సుమధురంగా "వేణునాదము" వినిపించింది ఫలితం కనిపించింది.

"శ్రీకృష్ణశరణంమమ" అనుకుంటూ రేయింబవళ్ళు "ద్విపద" ను దీక్షగా వ్రాసిపూర్తిచేశాను మాపెద్దబ్బాయి చి॥వి డా॥పినాక పాణి 'రాంచీ' నుంచివచ్చాడు 'రాంచీ' లోని "పరమహంస యోగానంద" గారి ఆశ్రమంలో క్రియాదీక్షతీసుకుని

ఆధ్యాత్మిక ధోరణి ఉన్నవాడు కనుక భాగవతము అన్నపేరుతో నేను రాసినదంతా చదివి, విని చక్కని సూచనలిచ్చాడు. రచనకు వేణునాదము అని పేరుపెట్టి శ్రీకృష్ణావతారము ప్రధానాంశంగా వేణువు శ్రీకృష్ణభగవానుని గూర్చి చెబుతున్నట్లు వ్రాస్తే చాలాబాగుంటుంది, భగవానుని గూర్చి చెప్పేది భాగవతమే ఔతుంది! "భాగవతము" పేరుతో అన్ని కథలూ రాస్తే పూర్తిగా న్యాయం చెయ్యలేకపోవచ్చు అందరికీ తెలిసినకథను వ్రాస్తున్నప్పుడు కొంత క్రొత్తదనంచూపిస్తే చదువరులకు ఆసక్తిగా ఉంటుంది, 'వేణువు' చేత కృష్ణతత్త్వం ప్రబోధింపచేస్తే నీ ప్రయత్నానికి సాఫల్యం ఉంటుంది అమ్మా! అన్నాడు వయసులో చాలా చిన్నవాడు ఎంతో అనుభవజ్ఞుడులా చెప్పేసరికి ఆశ్రీకృష్ణుడే వాడి నోటినుండి చెప్పించాడా అనిపించి ఆశ్చర్యం, ఆనందం కలిగింది. తర్వాత ముఖచిత్రం కూడా ప్రత్యేక సరళిలో శ్రద్ధగా వేసియిచ్చాడు.

అంతే మళ్ళీ మొదటినింటీ వ్రాయడం ప్రారంభించి చాలా రోజులు కష్టపడి వేణునాదము పూర్తి చేశాను చి॥ డా. శిష్ట్లా వెంకటరమణ చదివారు. ద్విపదనడక బాగుంది, ముఖ్యసంఘటనలు ముక్తసరిగా ముగించేయకుండా వివరంగా వర్ణించి చిత్రీకరస్తే బాగుంటుంది, ప్రయత్నించండి ఇంకా బాగారాయగలరు, ఆలస్యమైతే యేమి? తొందరేముంది? అంటూ అమూల్యమైన సలహాలను ఇచ్చారు, ఆయన జామాత. డాక్టరు. వృత్తివైద్యవృత్తి, ప్రవృత్తి సాహిత్యము, ఛందస్సు కరతలామలకం, అటువంటప్పుడు ఆయనయిచ్చిన సలహాలు శిరోధార్యమేకదా!

మళ్ళీ కొంత మధ్య మధ్య చేర్చి పూర్తి చేయగల్గాను, ఆశ్రీకృష్ణుడే అదృశ్య రూపంతో నాఓర్పును, శక్తిని పరీక్షించి మరీ విజయాన్ని ప్రసాదించాడని నమ్ముతున్నాను, మధ్యమధ్య నేను నిరుత్సాహపడుతూంటే ఎంతో ప్రోత్సాహాన్ని కల్గించారు చి॥ డా॥ దుర్గాచరణ నాగ ప్రసాద్, ఆయన మా జామాత. భక్తి వైరాగ్యములు మూర్తీ భవించిన వ్యక్తి. బాసర క్షేత్రంలో సరస్వతీ దేవిపాదాల వద్ద ఉంచి తెచ్చినపెన్నుయిచ్చి మీ రచనావ్యాసంగం యింకావర్ధిల్లాలి. దిన దినప్రవర్ధమానంకావాలని చెప్పి ఉత్తేజపరచారు, నాకేకాదు ఎవరు ఏమంచి పని చేస్తున్నా ఎంతో ప్రోత్సహిస్తు తన వంతు సహాయసహాకారాలందించే మంచిమనసున్నవ్యక్తి.

తర్వాత నాజ్యేష్ఠ సోదరుడు చి॥ భాగవతి సుబ్బారావు నెప్రూ, పద్యరచనలో దిట్ట, ఆసాంతంచదివి శీర్షికబాగుంది, రచనకూడా సులభశైలిలో సాగింది, తప్పకపుస్తకం అచ్చువేయిద్దాం అక్కయ్య! అన్నాడు. ఎంతో సహాయసహకారాలందించాడు. చాలా చాలా ప్రోత్సహించాడు.

తదుపరి మా చిన్నబ్బాయి చి॥ డా॥ చక్ర పాణి నాకు అస్వస్థత కలిగిందని అమెరికానుంచి చూడ వచ్చాడు. అమెరికాలో సైంటిస్ట్ గా చాలా బిజీగా ఉంటూకూడ ఏమాత్రం సమయంచిక్కి నా స్నేహితులతో కలసి "విష్ణుసహస్ర" నామపఠనం భగవద్గీతా పారాయణ చేయడం వాడికలవాటు. వేణునాదము చదివి విని చాలాసంతోషించాడు "శ్రీరామ కథాసుధ" లాగే వేణునాదము తప్పక అచ్చువేయిద్దాం అనిఉత్సాహంనింపివెళ్ళాడు.

ఇంక మాఅమ్మాయి డా॥ శోభ, రెండో అమ్మాయి డా॥ శైలజ కోడళ్ళు డా॥ లక్ష్మి, శ్రీదేవి అందరూ నా రచనావ్యాసం గానికి అడ్డుపడకుండా అభినందిస్తున్నారు.

డా॥ రావి రంగారావు గారు సాహితీ మిత్రులు సంస్థాపకులు, వారిసంస్థలో నన్ను కార్యవర్గ సభ్యురాలిగా జేర్చుకుని నారచనలన్నీ సంస్థద్వారా వెలుగు చూడుటకు ఎంతో సహాకరిస్తున్నారు, అమూల్యమైన సలహాలనందిస్తున్నారు, ఆయనకు కృతజ్ఞతలు.

వీరంతా నాకన్న చిన్నవారే వారందరికీ నాశుభాశీస్సులు, నారచనలకు ప్రథమ పాఠకులు సద్విమర్శకులు వారే చేయూతనిచ్చినన్నుముందుకు నడిపిస్తున్నదీ అచిరంజీవులే వారికి నా హృదయపూర్వక ఆశీర్వచనములు.

శ్రీ వారణాసి. లక్ష్మీజయ ప్రకాస్



తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి నా "వేణునాదము" రచకు ముందుమాట వ్రాసియిచ్చిన డా॥ ముదిగొండ శివప్రసాదు గారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

కళాశాల భాధ్యతలు, సాహితీ మిత్రుల సంస్థ కార్యనిర్వహణలతో తలమునకలౌతున్నా అడగంగానే నా అభ్యర్థన మన్నించి నారచనను చదివి తమ అమూల్యాభిప్రాయం అందించిన డాక్టర్ రావిరంగారావుగారికి నా కృతజ్ఞతలు. త్రిభాషా పండితులు, విజ్ఞులైన శ్రీ మాదిరాజురామలింగేశ్వరరావుగారు, శ్రీ వేణనాదం క్షుణ్ణంగా పరిశీలించి నా రచనలోని అంశాలను హృద్యంగా వెల్లడి చేసినందుకు సర్వదాకృతజ్ఞురాలను. ప్రత్యేక శ్రద్ధ తీసికొని నా రచన ఆశీస్సులందించిన శ్రీ దుగ్గిరాల రామారావుగారి నా నమోవాకములు.

భగవంతునిపై భారం వేసి, భక్తిశ్రద్ధలే ప్రాధాన్యంగా వేణునాదము ఆలపించడమైనది. సహృదయంతో ఆలకించమని మనవి చేస్తున్నాను. వేణునాదము ప్రతిచోట ప్రతిధ్వనించగలదని ఆశిస్తున్నాను. పెద్దలు పెద్దమనసుతో లోటుపాట్లున్నచో తప్పులు ఒప్పులుగా భావింతురని ఆశిస్తున్నాను, శ్రీకృష్ణపరమాత్మ సర్వులను కాపాడగలందులకు ప్రార్థిస్తున్నాను.

– వారణాసి సూర్యకుమారి

# శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన



ద్విపద

సిద్ధివినాయక ! స్థిరమగు భక్తి
శ్రద్ధలు మాకుప్రసాదించుతండ్రి!
విద్యలకధిపతి! వినయము నిమ్ము
పద్యములల్లగ పాండిత్యమిమ్ము
సకల సంకల్పముల్ సాధ్యముచేసి
చకచకచేయగ శక్తినొసగుము
వేణునాదము కృతివినిపించువేళ
బాణీల, నేర్పును బాగుగ నిమ్ము!
పామరులకు మరిపండితులకును
సామగానమువిన్న సంతృప్తి నిమ్ము!

# శ్రీ సరస్వతీదేవి



శారదామాత! నీచరణ సన్నిధిని
కోరుచుకావ్యము కూర్చగనుంటి
సాహిత్యమనబడు సాగరమీద
సాహసోపేతనై సన్నద్ధనైతి
సాగించ రచనను సంపూర్ణముగను
వాగీశ్వరీ నీవువరమిమ్ము ! తల్లి!
ధవళవర్ణా! పద్మదళనేత్ర! నీవె
సవరించివ్రాయించు సరళమ్ముగాను

శ్రీవాణి! వేడెద, శ్రీకరీ! నిన్ను
భావమ్ము, భాషయు, భారతీ! నీవె
కళలకు తల్లివి! కరుణించుమమ్ము
భళియనగను మెప్పుబాగుగనిమ్ము!
సంగీత సాహిత్యసంపదలన్ని
పొంగి పొరలనిమ్ము పూర్వపుణ్యమున
ఈవేణు నాదము యింపుగ నొప్పి
ఏవేళనైనను యశమొంద గనుము!

# శ్రీరామ



ద్విపద

శ్రీరామస్మరణము చేసెదనెపుడు
శ్రీరాముడెప్పుడు చిలికించు కరుణ!
కొలుతును గుండెను గుడిగనుజేసి
కొలువు తీరిచియుండు కోదండ పాణి!
పిలిచిన పలుకును ప్రియబాంధవుండు
తలచిన కనిపించు దశరథాత్మజుడు
మాతప్పు మన్నించి మదిలోన వెలసి
సీతమ్మ రామయ్య చింతలు బాసి!
శ్రీ భాగవత కావ్యసృష్టిగావింప
నాభాగ్య మగునట్లు నాకానతిడిరి
జనకజాతనురామ చంద్రప్రభువును
వినుమంచువేడెద వేణునాదమును
రచనను మెచ్చుచు రాఘవుండపుడు
వచియించు తిరముగ వర్ధిల్లుమనుచు

కం.

రామా! రఘుకుల సోమ!
మా మా యఘములును బాయుమార్గమునుపరం
ధామా! చూపించగదే
సామాన్యూల మయ్యా! మాకు శరణమునీవే!



# శ్రీకృష్ణ

సీ.

శ్రీకృష్ణ! శరణమ్ము! శ్రీరుక్మిణీనాథ!
కరుణతో దనునన్నుగాంచరమ్ము!
పురుషోత్తమునిగాథ పుణ్యమనితలచి
పూనితి వ్రాయగ స్ఫూర్తినిమ్ము!
ఆద్యంత మెరుగను! ఆదినారాయణ!
అండగా నీవుండి, ఆదుకొమ్ము!
భాగవతమ్మును పఠియించు వారికి
ప్రాజ్ఞత, భక్తియు, భాగ్యమిమ్ము

తే.గీ

వేణుగానవిశారద! వేదవేద్య!
భక్తమానసచోర! యో పరమయోగి!
వాసుదేవ! యజ్ఞపురుష! వసుమతీశ!
నందనందన! నీకిదె వందనమ్ము!



# స్వపరిచయం

ద్విపద-

భాగవతృన్వయంబగు పుట్టినిల్లు
త్యాగధనులు వారు ధర్మబద్ధులును
జనని సత్యవతి మజ్జనకులు, వారు
ఘనులు, సుబ్బారావుగారనువారు
సంతతియున్నతిన్ స్వర్గమ్మునుండి
సంతృప్తి గమనింత్రు సంతసపడుచు;
ముగ్గురుతమ్ములు ముచ్చట గొలుపు
ముగ్గురు మరదళ్ళు ముత్తియమ్ములుగ,
సోదరుల్ముగురు నెహ్రూ-బోసు-తిలకు
ఆదరమ్మునజూతురని శమ్మునన్ను,
పిల్లపాపల వారు ప్రియమారగడప
చల్లగ జూచును సర్వేశ్వరుండు

అత్త వారింటి పేరది వారణాసిల
మెత్తని మనసున్న మేథావులండి
చల్లగ జూచును సర్వేశ్వరుండు
ఊరువారందరు ఉత్తములంద్రు
పేరుగాంచిన వారుప్రేమించువారు
మామగారునరసింహము అత్తగారు
కామేశ్వరమ్మయు కడు రమ్యగుణులు
వారియాశీస్సులే వరములై నిలువ



వారిసంతతి యంతవర్థిల్లుచుండె
భర్త లక్ష్మీజయ ప్రదనుగారండి
కర్తవ్యపాలనన్కడుఘనులండి
నలుగురు బిడ్డలు నాలుగు చోట్ల
పలువురుమెచ్చగ పచ్చగనుంద్రు
విద్యాధికులువారు వినయవంతులురు
ఉద్యోగములు చేయుచుండిరి మెలమి
శోభయు శైలజసుతలు; తనయులు
వైభవులు పినాకపాణియు, చక్రి
తల్లిపై వారికి తరగనిప్రేమ
ఎల్లవేళల జూతురే లోటులేక
దొడ్డగుజంటలు దొరికెవారికిని
బిడ్డలు నవ్వుచు ప్రీతిగనుండు

అన్యోన్యముగ నుండి ఆనందముగను
అన్యులకుపకార మాచరించెదరు
ఆభారతి రమయు ఆశీర్వదించ
శోభప్రసాదులు శోభిల్లుచుంద్రు
శైలజ-సిరి-సరస్వతియూ దీవించ
శైలజ రమణయు చల్లగ నుంద్రు
వాణియు రమయును వరములనీయ
పాణియు, లక్ష్మియు పచ్చగనుంద్రు
చక్రి సతియు సరస్వతి కరుణించ

చక్రియు, శ్రీదేవి సౌఖ్యమ్ముగలరు
చక్కగ పొందిరి సంతతి వారు
మక్కువ నక్కున మనుమలు జేరు
నీలు, మనూ, వర్షిణీ, హర్షిణీలు
మేలిమి బంగరు మెరికలు వారు
వంశీ, వరుణులు మావంశాంకురములు
వంశీవినోదుని వరపుత్రమణులు
పిల్ల పాపల వారు ప్రియమారగడుప
చల్లగ జూచును సర్వేశ్వరుండు

కం. ఎవ్వరు సద్గుణవంతులు
ఎవ్వారుపకారబుద్ధినెసగుదురెపుడున్
ఎవ్వరుదయార్ద్రహృదయులు
అవ్వారు జయప్రదన్ కునాలినిధన్యన్

కం. సత్యము పలుకుచు దేవుని
నిత్యము పూజించు చుండునిర్మలభక్తిన్
కృత్యములందున తా కృత
కృత్యులు! వారిన్స్మరింతు ప్రియమలరంగన్.



# వేణునాదము (ద్విపదకావ్యము)

ఓం కారనాదమ్ము ఉద్భవించినది
ఓం కారశబ్దమ్ము నుచ్చరించుటకు
ప్రథమమ్ము ప్రభవించె ప్రణవనాదమ్ము
విధి సృజియించె నీ వింతవిశ్వమ్ము
తొలుత శబ్దముపుట్టె తోయ మగ్నియును
ఇల వాయు వాకాశ మీరీతి వెలసె
పంచభూతాత్మకంబైన విశ్వమ్ము
పంచేంద్రియమ్ముల పరగు దేహమ్ము
సృజియించబడుటయె సృష్టి చిత్రమ్ము
భజియించవలెనంత భగవంతు నెంతొ
పన్నగ శయనుడు పట్టి వేణువును
కన్నయ్యగ వెలసి కరుణించవచ్చె
ప్రణవనాద మ్మిది ప్రజ్వరిల్లగను
వేణునాదమ్మిది వినిపించునిపుడు
జగపతి వేణువు సవరించి నంత
జగతిని నాదము జాగృతి చేయు
మోహమ్ము వలదంచు మోహనవంశి
మోహింపగనుజేయు మురళీ రవళిని
ఆశ్రీశుడే నాకు అభయమ్ము నిడగ
ఆశ్రయించితి హస్త మతిపుణ్య ఫలము
ఒప్పుదు రంధ్రాల నొడలంత నిండి
మెప్పును పొందుదు మెండుగా పలికి
వేణుగోపాలుడు వ్రేళ్ళతో మీట

వాణినై పులకింతు వాత్సల్యమునను
అధరమ్ము తాకంగ ఆలాపనమ్ము
సుధలు వర్షింతును సురలు మెచ్చంగ
ముచ్చట గొలిపెడు ముద్దు కృష్ణుండు
మెచ్చెదు వారిలో మేటి మురళిని
వంశినామమ్మున వర్ధిల్లుమనుచు
వంశికృష్ణుడు నాకు వరము నొసంగె!
కమలాక్షునకు నేను కరభూషణముగ
అమరు టదృష్టమ్ము ఆనందమగును
పిల్లన గ్రోవిని ప్రీతి కన్నయ్య
కొల్లగనుల్లముల్ కొల్ల గొట్టంగ
పిల్లన గ్రోవిని పిలుపును వినుచు
ఎల్లరు గాంచెద రెనలేని ముదము
పాటగ నూదుచు పలుకరించుచునె
ఆటగ మీటుచు ఆడించు చక్రి
కన్నవారికి కనగల్గు వారికిని
చిన్న నాటనె జూపె చిలిపి తనమ్ము
మువ్వగోపాలుని ముద్దు ముచ్చట్లు
ఎవ్వరికైె నను హితమనిపించు
సరళ స్వభావమ్ము సాధువర్తనము
మురళీ రవమ్మున మురిపించుచుండు
సాహసమ్ములు చేసి సఖులను బ్రోచు
మోహన రూపమ్ము ముగ్ధులం జేయు

వ్రేపల్లె వాసులు రేయింబవళ్ళు
గోపాలు కీర్తింత్రు గొప్పగవారు
వికసిత వదనాల వినుచు వేణువును
సకలమ్ము మరతురు సహజమ్ము గాను
శశిఖావ వేణువు సంగీత ఝరికి
పశువులు శిశువులు పరవశమెందు
వరమిచ్చి దేవకీ వసుదేవులకును
సరసిజనాభుండు జన్మించెభువిని
గోవులపాలించు గోపాలుడతడు
భావి నిర్దేశించు పరమాత్మయతడు
అట్టివానికి ప్రియమైనట్టి దాన

గట్టిగ చెప్పెద కన్నయ్య కథలు
అవతారపురుషుడై ఆవిర్భవించి
భువి భక్తులకు నిచ్చు పూర్తి రక్షణను
యుగయుగ మవతార యుగపురుషుడయి
ఖగవాహనుడు హరి ఖలుల శిక్షించు
కరుణను భక్తుల గావగ హరియు
ధరనుదాల్చె దశావతారమ్ములెలమి
అధరామృతము హరి అందించుచుండ
మధుర గానలహరి మరి దేలుచుందు
వేణువు నా పేరు వేలరాగముల
బాణీల హరికథ వర్ణించుచుందు

## అవతారములు

క్షీరాబ్ధి శయనుడు క్రీగంట జూచి
ఆరాధకుల కిడు అభయహస్తమ్ము
నమ్మిసేవించిన నరులను సురల
అమ్ముని వరులను హరి యాదరించు
వేదవేద్యుడు ప్రభవించిమత్స్యముగ
వేదతస్కరుచంపి వేదాలబ్రోచె
కూర్మమై భరియించె కోరి మంధరను
కూర్మి యమృతమును కూర్చుకొనంగ
మురిపించి యసురుల మోహిని యగుచు
సురలకు పంచెను సుధనంత శౌరి

కిరియైక్షితినిగాచి కీర్తిగడించె
సరిలేరు పరికింప శౌరికెవ్వరును
నరసింహుడై హిరణ్యకసిపుంజీల్చె
కరకునఖమ్ముల కంబమ్మునుండి
ప్రత్యక్ష మయ్యెను ప్రహ్లాదునకును
సత్యమో భక్తికి సంతృప్తినొంది
వామన మూర్తియైవరగర్విబలిని
తామస మణచి పాతాళమ్ము పంపె
పరశురామునిగ భూపతులనందరను
పరిమార్చె పలుమార్లు పరశువుతోడ



రామావతారియై రావణుం జంపి
రాము సీతనురాజ్యరమనేలెను హరి
కృష్ణావతారియై కృపను దుష్టులను
తృష్ణదీర దునిమి తృప్తినిబొందె
ఏలీల శ్రీకృష్ణు డే లెనోయిలను
ఆలీల లెరిగింతు అవలీల, లలిని
ఆలసించక మీరు అతులితలీల
ఆలకించుడు లీలలానంద మలర
మానుష విగ్రహ మహిమాన్వితుండు
మానవులకు దైవ మా రమాధవుడు
లీలలు జూపుచు లిప్తమాత్రమున
లోలతనాడించు లోకమ్మమరువ
వేణునాదమ్మున వేడుక గొలిపి
వేణు నాథుడు మెచ్చ వేనోళ్ళ గొలుతు

జీవమే లేని నాజీవితమ్మునకు
ఈవిధి లభియించె ఈశునికరుణ
పీతాంబర ధరుండు ప్రియబాంధ వుండు
ప్రీతిగా మురళిని పిలుచుచునుండు
పరమాత్మ నాచేత పలికించు టయును
అరయంగ తోచును ఆకృష్ణలీల
యేపరిమితి లేదు శ్రీశునికృపకు
ఊపిరి పోయును ఊదుచు మురళి
అవతార పురుషుడు అనురాగ లహరి
అవని భక్తులదేల్చు అవధిలేనటుల
కృష్ణాధరామృత కృపవిశేషమున
కృష్ణుని చరితము కెరలిపాడుదును
వేణువు నాపేరు వేలరాగములు
బాణీలు వినిపింతు భాగవతమ్ము



## భాగవతము

### కృష్ణావతారము

వ్యాసుడు ~~శుకమౌనివరునకు తెలుప~~
వ్రాసెను శ్రీభాగవతమును తొలుత
శ్రీవిష్ణు గాథను శ్రీభాగవతము
ఏవిధమ్ము నెవరు ఎవరికి తెలిపె?
క్షితిపతి యాపరీక్షిత్తునకు శుక
యతి నుడివెను దాని నాదరమ్మునను
అడవికి యొకపరి అరిగివేటకును
పుడమి నేలేడురేడు పులుగుల జంపె
మృగయావినోదాన నృపవరుండలసి
మిగుల పిపాసియై మెండుగ వెదకె
నీరమర్థించెముని శమీకుజేరి
ఆరేనిరాకను అరయకుండె ముని
కనుమూసి తాపసికదలక యుండె
మనమున కుందెను మానవాధిపుడు
ప్రతివచనమిడక ప్రభువును కనక
యతి యుండగని రేడు అలుకను బూనె
కినుకతో భూపతి క్రిందుమీదగుచు
కనుగాన కుండెను కలిప్రభావమున
ఊపిరి లేనట్టి ఉరగమును గని
శాపమిడుననియు జంకకనృపతి

అసువుల బాసిన ఆయహినపుడు
కసిని వేసెను ముని కాయమ్ముపైన
తాపసింగాంచిన తనయుడు శృంగి
శాపమ్మునిచ్చె రోషావేశమతిని
"తప్పదు రేనికి తక్షకుంగాటు
తప్పదు శిక్షయు తప్పుజేయగను
వారముదినములె వానికిగడువు
మీరజాలడు శాపమీరాజు" అనుచు
శాపవిముక్తికి సాధ్యమ్ముగాక
పాపమూర్వీశుడు పరితాపమొందె
తథ్యము మరణము తనకని నృపతి
మిథ్యయె జగమని మిక్కిలి తలచె
వైరాగ్య చింతన వహ్నియైరగిలె
నైరాశ్య మంతట నాట్యమ్ము జేసె
అవసాన దశనంత నబ్భాగవతము
శ్రవణమునగలుగు సద్గతి యనుచు
అర్థమ్ము నెరిగింప నాభాగవతము
అర్థించెనుశుకుని ఆపరీక్షిత్తు
శ్రీభాగవతమును స్థిరమతివినుట
నాభాగ్యమగునని నమ్మెనారాజు



అడిగిన, నుడివిన, ఆలకించినను
అడుగడుగున శుభమిడు హరిచరితమ్ము
వ్యాసపుత్రుడు మునివరుడు శుకుండు
వాసుదేవుని గూర్చి వరుసగ దెలిపె
నరజన్మమెత్తిన నారాయణుండు
ధరనుగావ మురళీధరునిగ వెలసె
అతిపవిత్రంబైన ఆకృష్ణునికథ
అతిభక్తి శ్రద్ధల నాలకించవలె
భ్రాంతిని బాయగ భక్తియు కలుగు
శాంతము తోడను శౌరినిగనుడు
భక్తి కన్ననుమంచి పథమునులేదు
భక్తి యుండినచోట భగవంతుడుండు

భగవంతుడిచ్చు నభయమును మనకు
తగునమ్మకమ్మున్న తరియించ గలము
దేవుడే జీవుడై దేహమనబడు
దేవాలమ్మున తీరుగనుండు
మానవ సేవయే మానవునకును
సాధన మగు నింకసాయుజ్యమంద
పరిపూర్ణ దర్శన పానతానముల
హరిపదోద్భవగంగ అఘములబాపు
శుకముని భోదించెసులభ మార్గమును
సకలము వినసాగె శ్రద్ధగ తేడు
వేణువై వినిపింతు విష్ణునికథలు
వేణువై అలరించి వివరింతునిపుడు



# శ్రీకృష్ణ జననము



శ్రీ పతింజేరుచు శిరములు వంచి
ఆపదల్ బాపగ నర్థించిరంత
అసురుల ఆరళ్ళు, ఆ సురల్, మునులు,
వసుమతి నుడివిరి వాసుదేవునకు
భూభార మణచంగ భువిపైన వెలసి
శోభస్కరమ్ముగ శోధించమనిరి
వల్లెయనుచు హరివరమిచ్చి పంపి
నల్లనయ్యగనుతా నవతరించెనిక
ఆదిదేవునియాజ్ఞ అదితి కశ్యపులు
ఆదేవకివసుదేవాఖ్యులైనారు
మధురానగరిలోన మహినాథు తనయ
అధిక సద్గుణవతి అందాలయువతి
దేవకియను నామధేయను వలచె
ఆ వసుదేవుండు హరివర మంది
వరియించి వచ్చిన వసుదేవునకును
పరిణయమ్మాయెను పడతి దేవకికి
కనువిందుకలిగించె కనగనాజంట
పెనుసందడిని గూర్చె పెళ్ళిసందడియు
అప్పగింతలు పెట్టి ఆమెనంపంగ
గొప్పచీరలు సారెగూర్చి రియపుడు
ఉగ్రసేనుని సుత ఉత్సాహముగను
అగ్రజుడగుకంసునరదమ్మునెక్కె

క్రొత్త దంపతులను కూర్మి కంసుండు
ఉత్తమ రీతిని ఊరంపవచ్చె
సోదరి దేవకిన్ శుభమస్తు అనుచు
సాదరమ్ముగ జూచెసాగనంపుటకు
అంతట వినిపించె అశరీరవాక్కు
వింతగ జూచిరి వినువీధి దిక్కు
"చెల్లెలు దేవకి క్షేమమ్ము నరయ
చెల్లెలి బిడ్డయె చెల్లించునిన్ను
అష్టమ గర్భము అగునరిష్టమ్ము
కష్టము కొని తెచ్చుకంస మామకును
నీకింకమృత్యువునిక్కమ్మెయనుచు
ఆకంసునకు చెప్పె ఆకాశవాణి
వెతనొందె కంసుడు వినినంతలోనె
కుతకుత లాడెను క్రోధమ్ము తోను
పగబట్టి బుసకొట్టు పన్నగమువలె
సిగబట్టి సోదరిన్ శిక్షించ బూనె
స్యందనమునుదించి సభ్యత మరచి
బందీలుగను జేసె బంధుత్వ మనక
ఇసుమంత జాలిని ఇంతిపై జూపు
పసికందు నర్పింతు ప్రసవించి నంత



మిన్నున విన్నదె మిన్నగ నెన్ని
చిన్నచెల్లెలినిట్లు శిక్షింపదగునె?
శిశువును నీకిత్తు శీఘ్రమ్ము నమ్ము
శిశువన్న భయమన్న సిగ్గుకాదన్న?
సోదరి నేడ్పించ సోద్యమోయన్న!
ఆడిది సబబును కనమెందునను చు
వసుదేవుడర్థించె వడికేలుమోడ్చి
కసినిపెంచుకొనియె కంసుండు విడక
వారేమి చెప్పిన వల్లకాదనుచు
కారాగృహమ్మున కాపురమ్ముంచె
విలపించిదంపతుల్ విధి లేకయుండి
తలచిరిమది మంచి తరుణమ్ము నరయ
కలతచెందుచు కొంత కాలమ్ముగడుప
కలిగెనుసంతతి కడుముచ్చటగను
కాలనేమి యగునాకంసుండుకడకు
కాలరాసెను వారికన్న బిడ్డలను
సప్తమ సంఖ్యను సంతతిన్ బాసి
గుప్తముగ హరిని కోరిరి శరణు
పురుషోత్తముని వేడి పుణ్యదంపతులు
వరుసగ తెలిపిరివారి కష్టములు
వారి మొరలు విన్నవారిజాక్షుండు
కోరిజన్మించెను కొమరుడై తాను
అష్టమగర్భము అష్టమితిథిని
కష్టము లీడేర్చు కానుపు జరిగె

దేవకీ దేవికి దివ్య గర్భమున
ఆవిష్ణు మూర్తియే ఆవిర్భవించె
వారిద వర్ణుండు వరము నొసగియు
కోరిజన్మించెను గోవిందుడపుడు
ఆ విష్ణు తల్పమ్ము ఆదిశేషుండు
దేవకి కడుపున దివ్యమ్ము నమిరె
సప్తమ గర్భమున్ జాగు సేయకను
గుప్తమ్ము గనుచేర్చె కోరి రోహిణిని
శ్రీ హరిప్రేరణ శీఘ్రమ్ముమాయ
రోహిణి గర్భమ్ము రూఢిగ నుంచె
వసుదేవునిసతి యావనిత రోహిణియు
కంసదండన నుండి కాచె శిశువును
ఆదినగ్రజునిగ ఆదిశేషుండు
మోదమ్మున బలరామునిగజన్మించె
బలరామ నామమ్ము బరగనగ్రజుని
అలరించె విష్ణువు అనుజుడై పిదప
తారరోహిణిలోన ధరనుద్భవించి
వారికోర్కెను దీర్చె వనజనాభుండు
పిల్లవానిని తల్లి ప్రేమతో నిమిరె
తల్లి ప్రేమకు సాటిధరలోన కలదె?
దేవకీ వసుదేవ దివ్యానుభూతి
ఏవిధివర్ణింతురేవేల్పులైన?
దివినుండి భువికిని దిగివచ్చి హరియు
చవిజూపె పుత్రసంజనితమోదమ్ము

పుడమి తల్లికి మది పులకించెనపుడు
పడసాగె నానంద బాష్పాలవాన
తలచెనేమొ తగిన తరుణమ్మదియని
మలయ మారుతమును మరిమరి వీచె
అవతారమూర్తియై హరియరుదెంచె
నవరించి దుష్టులన్ సంహరించుననని
ఆడిరిపాడిరి అప్సరసలును
వేడుక చూసిరి వేల్పులు మునులు
నరులకు నడుమనునరునిగ నలరి
అరులనసురుల హరియించును హరి
కంసాదిదానవగర్వమ్ము నణచి

హింస బాపును భక్త హితమును గోరి
సారె సారెకు బుట్టు సారసాక్షుండు
వారి వారికి వంతు వచ్చిన యంత
పాలకడలి మురిపాలనువీడి
కాల రాయగ వచ్చుకాలాంతకులను
ఆపృథ్వివేడగ ఆదివిష్ణువును
పాపుల పరిమార్చి భారమ్ముదీర్చు
వెన్నునివన్నెలు వేణువైగనుచు
మిన్నగ నెన్నుదు మేదినీ హితము
వేణువు నాపేరు వేలరాగముల
బాణీల వినిపింతు భాగవతమ్ము.





# కృష్ణునిరేపల్లెకు జేర్చుట



అరవిందదళ నేత్రుడదంద చందాల
హరియొప్పె నవనిగ నాహ్లాదకరము
నున్ననిబుగ్గలు నుదుట తేజమ్ము
కన్న వారికనుల కలిమి కన్నయ్య
వర్ణమ్ము అరుదైన వర్చస్సు కలిగి
వర్ణనాతీతమై వనమాలియొప్పె
ముసినగుప్పెట్లు ముడిచిన బొమలు
ఆసించ గలనను చందమ్ము దోచె
మురిపెమ్ము దీరగముద్దాడుటకును
తరముకాలేదింక తల్లి దండ్రులకును
కడుపు తీపిని కన్న కర్తవ్యమందు
కడుదీక్ష బూనిరాకన్నవారపుడు
కనవితీరకనె యా తల్లియు, తండ్రి
తనయుని వీడగ తలచిరి మదిని
కంసుడు బిడ్డను కడతేర్చునట్టి
హింసనువారు సహించలేకుండె
సమయమ్ము చాలక సంతసించుటకు
తమబిడ్డనట నుండి తప్పించ జూచె
మమతను మనసున మఱచుటె తగును
తమకు తప్పదనుచు తలబోసె వారు
శ్రీహరియాజ్ఞను శిరమున దాల్చి

సాహసించిరి వారుసర్వమ్ము విడువ
పలుమార్లు నలుదెసల్ పరికించి జూచి
వలువలుబిడ్డకు వడివడి చుట్టె
ఆవిష్ణుమాయంత ఆక్రమించంగ
కావలి వారును కనుగానలేక
మత్తుజల్లిన యట్లు మాయక్రమ్మ గను
చిత్తుగ నిదురను చేరిరందరును
నిశ్శబ్ద నిశినంత నిదురలో నుండ
శిశువుతో వెడలెను శీఘ్రమాతండ్రి
ఆపద దాటగ నారా టపడుచు
తాపత్రయమ్మున తరలెనాతండ్రి
కన్న పట్టిను పట్టి గంపను పెట్టి
సన్నగ పడువాన జల్లున వెడలె
ఎవ్వరునడ్డమై ఏమనకుండ
సవ్వడి సేయక సాగె ముందునకు
పాపడి తోడను పట్టు దలగను
రేపల్లెకువడిగ రేయంత నడచె
దైవసంకల్పమె ధరణినిజెల్లు
ఎవరేమి తలచిన నేమియుకాదు
సమయానుకూలమ్ము సమకూరు నన్ని
విమలచరితులకు విధితోడుపడును

బిడ్డ నెత్తుకొనియు బిరబిరానడువ
అడ్డుగాకయమున అండ గానిలిచె
కటిక చీకటిలోన కాళ రాతిరిని
చిటెకెలో నదిదాటె చిత్రమ్ము గాను
చల్లగాలికి సడి సంగీత మాయె
నల్లనయ్య కునంత నవ్వు లాటాయె
అర మోడ్పు కనులలో అలవోకనవ్వు
హరి మోమువికసించు అరవిందమాయె
శ్రావణ మేఘాలు సంబరపడుచు
ఆవరించెను నాడు అంబర వీధి
తరువులు విరులూని తరుణులు తమరి
కురులందు విరులను కూర్చినట్లుండె
భూమాత వల్లభున్ పులకించి జూచి
ఆ మాధవుని కుసుమాంజలి గొలిచె
యమునను అడుగిడుయత్నముంజేయ
అమరెను ఛత్రమైఆది శేషుండు
అదిదైవ ప్రేరణ అదియె సేవనుచు
ముదమున జేసిరి ముచ్చట పడుచు
పాపాపహారి యా పరమాత్మ పుడమి
పాపడై వెలసిన పసిడి వేళయది
గగనమ్ము తారలు కలకల లాడె
దిగివచ్చె దివినుండి దిక్పాలకులును
శశివదనుని గని శశికాంతితోడ

నిశితిమిరము బాపెనిశినాధుడతడు
పవనుడు వీచెను పల్ల వకరము
అవనిని చిందెను అందము కరము
పంచ భూతమ్ములు పరమాత్మ గాంచి
పంచప్రాణములుగ పర్యవేక్షించె
భూత భవిష్యత్తు భువివర్తమాన
మే తాను చక్రికి మితములే దెచట
అందరి క్షేమము నరయుచు హరియె
నందుని చెంతకు నను జేర్చుమనియె
వసుదేవుడంతదై వాజ్ఞమేరకును
పసిబిడ్డ నటజేర్చె పదిలమ్ముగాను
నందయశోదలా నందమొందంగ
అందెవిడచివచ్చె ఆభాగ్యమేమొ
పసివానికు శలమ్ము పరమాత్మునాజ్ఞ
వసుదేవుడు తనకు వరమనితలచె
యాదవులందరి ఐశ్వర్యమనగ
ఆదరి జేరెను ఆవిష్ణు మూర్తి
భాధ ద్రింగుచు కంసు భ యమునక్రుం
మాధవునట వీడిమాయ నిటుతెచ్చె
సకలమ్ము నెరవేర్చు సంకల్ప బలము
సుకరమ్ము జేయును శుభముహూర్తమ
ఆయశోదకు పుట్టె ఆయోగమాయ
ఆయమనిట జేర్చి హరినట నుంచె



దేవకి కడకును దివ్యమ్ముగాను
ఆవిధి జేర్చెను ఆమాయనపుడు
వసుదేవుడర్థించ వాసుదేవుండు
వసుధను వసియించె వంశీకృష్ణునిగ
పురిటి కందును చంప బూని కం సుండు
అరుదెంచ దేవకి అన్నా వలదనె
అష్టమసంతతి ఆడపిల్లకద
కష్టపెట్టకు అన్న కరుణించుమన్న
కడుపుకోతకుమించు కష్టమ్ము లేదు
తడియారని కనుల దైన్యమ్ముగనవె!
ఒకరిద్దిరునుకాదు ఒడి నేడుగురును
ఒకలాగె బోయిరి ఓర్పులేదింక
ఆవేదనపడుచు నాయాడ పడుచు
దేవకి వేడెను దీన స్వరమున
సోదరిపై జాలి చూపక నతడు
వాదమువలదంచు వధియింపబూనె
కఠినుడై కంసుండుకరవాల మెత్త
వితలు నిమాయంత విస్పష్ట మాయె!
సరిజోడి నీ కిలజన్మించెననుచు
హరిమాయ నెరిగించె ఆశక్తి యపుడు
ఉరుములు మెరుపులు ఊరంతనదిరె
కరకు గుండియవాడు కంసుండు బెదిరె
వినువీధి కెగిరిన వింతయాకృతిని

కనెశూన్య దృక్కులకలవర పడుచు
కలహమ్ము గోరిన కాలనేమియును
తలబోసె మరణము తనకు తథ్యమని
పానీయముల యందు భక్ష్యమ్ములందు
తానుగాంచె హరిని దర్పణమందు
ఎక్కడ నెందును యేమి చూసినను
అక్కడ కనిపించె ఆవిష్ణుమాయ
అందమైన హరిని అరియని తలచి
మంద బుద్ధినికుందె మామకంసుండు
తనకింక మరణము తప్పదనుచును
కినుకను దీనుడై ఖిన్నుడై యుండె
మృత్యుభయమ్మున మృత కల్పుడయ్యె
నిత్యము కృష్ణుని నిర్జించ తలచు
వేరువేరాకృతుల్ వివిధ రక్షసుల
చారుల శ్రీహరి జాడకై పంపు
పగనైన వగనైన భక్తితో నైన
ఖగవాహను దలచ కరుణించునతడు
అది యెరుగకకంసు డజ్ఞానమునను
మదినెంచె హరి గూల్చమాటలె యనుచు
అరియంచు హరినితాహరియించనెంచి
సరిసరి యనువారి, సన్నద్ధ పరచె
ఆనాటి నుండియు అనవరతముగ
తానాహరినిజంప తపియించు చుండె

# చిన్ని కృష్ణుడు



వటపత్రశాయిగ వనమాలివసుధ
నటియించ నందుని నందనుండయ్యె
చిద్విలాసమ్మున చిన్నికృష్ణుండు
పృథ్విపై వెలిగెను పూర్ణ చంద్రునిగ
ఆయశోదానందులానంద మొంద
ఆయమునయు పొంగె హరిని సేవించి
ఉల్లముప్పొంగుచు నుండయశోద
పిల్లవానిని జూపె పిలిచి యెల్లరకు
మంచిరోజునపుట్టె మా పాపడనుచు
పంచిరి చక్కెర పండుగ జేసి
పులకించె నా తండ్రి పుత్రోదయమున
చిలికించె చిరు నవ్వు సిరుల నాతల్లి
సంతోష మిచ్చును సగము బలమ్ము
వింతైన యనుభూతి వివరించగలమ?
సతిధర, ద్రోణుడున్ చతురాస్యువరము
సతియశోదా, నందు చందమ్ము బుట్టె
పూర్వజన్మ వరమ పూర్వమై విశ్వ
సార్వ భౌమునిపొందె చక్కని సుతుగ
పెరిగెను వారింట బిడ్డడై శౌరి
పెరిగెను వారింటి పేరు ప్రఖ్యాతి
జగమంత భగవాను శక్తికి వశము
భగవంతుడగు చుండు భక్తులవశము
మగబిడ్డడని విని మగువ లందరును
తగుకాను కలతోడ తరలిరచ్చటకు
కన్నుల మిన్నగ కన్నయ్యనుగని
అన్నుల మిన్నలు ఆశ్చర్య పడిరి
అరుదైన బాలుని అందమ్ము జూడ
కరువయ్యె మాటలు కలిగెను ముదము
కమలనేత్రమ్ములు కంబుకంఠమ్ము
విమల చరితులను విస్మయపంచె
అంబరమున మేఘ మా మేనిఛాయ
సంబరముగజూచె సఖులంతగూడి
ఆనంద నందనున్ అందుకొనుచును
ఆనంద బాష్పాల నలరిరందరుకు
ఆయశోగాదేవి హస్తాబ్జములను
తోయజనేత్రుండు తుమ్మెదయయ్యె
వింత తేజమ్మున వెలుగొందువాని
ఎంత జూసిన తృప్తిలేకుండెనపుడు
ఆజాను బాహుడై ఆబాలుడుండె
తేజమ్ముగాంచంగ దివ్యత్వ మొప్పె
నల్లని వానికి నామమేమనగ
బుల్లి నోటను నవ్వు పువ్వులై విరిసె
విశ్వాత్ముడును విశ్వవిభుడగు వాని
విశ్వమ్మునను పేరు వివరించవశమ?
సమ్మోహనంబుగ శౌరినవ్వగను



దిమ్మెరపోయిరి దిక్కులు జూచి
బోసినవ్వును జూచి పొలతులందరును
ఊసుల నాడిరి ఉత్సాహముగను
కారణజన్ముండు కానోపునితడు
దారుణమ్ములు బాపధరణిజన్మించె
చిన్న వానిని జూడ చిత్రమ్ముదోచు
కన్న వారి కితడు కలలు పండించు
తనయుగనియశోద ధన్యతగాంచు
ఘనతను పెంచు నీ కమలాక్షుడిపుడు
బాలుని గాంచుటె భాగ్యముమనకు
కాలముపరుగిడు ఘనమగురీతి
అనిమిషులకు కన్న అందమ్ముమిన్న
అనితర సాధ్యమీ యానందమన్న
సిరిగలవాడైన శ్రీహరియగున?
శిరమునగంగతో శివుడన తగున?
ఇంద్రుడ? చంద్రుడ? ఇనుడౌన? ఇతడు!
సంభ్రమమంత గలిగె సందేహమవుడు
పరిశీలనగనుండు బాలునిదృష్టి
పరమార్థ మెరిగించు భక్తి కల్గించు
ఈ త్రిభువనముల నేల బాలునిగ
ఆ త్రిమూర్తులు నేకమైవచ్చి రేమొ!
గతజన్మ పుణ్యంబె కారణం బగున?
సతతమీ కృష్ణుని సాన్నిధ్యమొంద
పసివాని వదనమ్ము పరమాత్మగనుచు
వసియించియుండుట వరమోను మనకు
పూర్వజన్మములోని పుణ్యఫలమిది
ఓర్వలే మెడబాసి యొకనిముషమును
పసివాని నవ్వుల పరవశమొంది
పసిడినవ్వులనుచు పలికిరెల్లరును
నవ్వులు కురిపించు నవరతనాలు
నవ్విన వినిపించునవరాగములును
ముద్దుకృష్ణుని జూసి ముదితలుమురిసి
సద్దుచేసిరి వారు సంబర పడుచు
మాయశోదమ్మకు మమతలపంట
మాయూరికె వెలుగుమా నల్లనయ్య
వసుధయశోదయెవరమందె ననుచు
విసుగనకనెవేయి విధముల పొగడె
మందహాసమ్మున మందగమనలు
సుందర రూపుడు సుకుమారు డనిరి
ప్రమదలు చేసిన ప్రవచనమ్ములను
తమకు దీవెనలని తలచెయశోద
బిడ్డడినియశోద ప్రీతిగ జూచి
గ్రుడ్డిగ నమ్మెను కొమరుడెయంచు
తన గర్భ సంజాత తనయుగ తలచి
మనసార మురిసెను మమత నాతల్లి
ప్రియమార పుత్రుని పిలుచుకొ నుచును
నయనాలనిండుగ నవ్వెనాతల్లి
అదియె విష్ణునిమాయ అదితెలియంగ

కుదురున జ్ఞానులు కోవిదులైన?
అమ్మమనసు నంత ఆ మాయె నిండ
గుమ్మరించెను ప్రేమ కొమరునిపైన
తన్ను తా మరచి యాత్మజులనుపెంచు
కన్న తల్లిదిగాదె కడుపుతీపన్న?
ఇరువైపు తలిదండ్రు లీ రీతి మురియు
వరమిచ్చెకని, పెంచ వారలకు హరి
కడుపారకనకున్న కనులార కనగ
కడురమ్యము యశోదకవనీయమనగ?
కన్నట్టి దేవకి కాలమహిమను
కన్నబిడ్డను సాక కలిసిరాలేదు
చూసిరి బాలుని సుఖముగవారు
చేసిరికంసుని చేటు లేకుండ
సంతతి నంతను సంహరించంగ
చింతతో కృష్ణుని చేర్చెరేపల్లె
తను చూడలేకున్న తనబిడ్డ దలచి
మనసార దీవించు మమత నా మాత
ఆదినుండియుగూడ అమ్మదీవెనలె
ఆదినివ్యాధిని అంటక గాచు
గోకులమందున్న గోవిందు తలచి
సాకునమ్మమనసు సౌఖ్యమ్ము మనగ
ఆయశోదకు నిచ్చె హరి వరములను
ఆయమ్మకును బిడ్డయై పెరుగంగ
చేసిరి పుణ్యము చెప్పలేనంత
చూసిరి హరి బాల్యచోద్యాలనన్ని

అద్దాల బిడ్డగ నవతార మూర్తి
దొడ్డగ మనసులు దోచుచునుండె
నందుడును యశోదనల్లని వాని
అందాల మురియుచు ఆడించుచుండ్రు
ముగ్ధ మనోహర మోహన వంశి
స్నిగ్ధసుకోమలస్మిత వదనుండు
చల్లని కృష్ణుని సన్నిధి కోరి
పిల్లన గ్రోవిని ప్రీతిగనుందు
భగవాను సేవించు బాగ్యమ్ము వలన
తగురీతి కృష్ణావతారమ్ము గంటి
కడుపునవిశ్వమ్ముకలిగున్న హరిని
కడుపున దేవకి కడుప్రీతి మోసె
నందయశోదలనయన సంపదగ
సుందరుడై హరి, సు తునిగ పెరిగె
బ్రహ్మాదులైనను భావించలేని
బ్రహ్మంబు గోపాల బాలుడై వెలసె
ఉనికి యర్థమ్మది ఉండెను కృష్‌కి
అనగ “ణ” కారము ఆనంద మగును
కావున కృష్ణగ గర్గుడు పెట్టె
పావన నామము పరమేశునకును
ఆనందమొదవును అనగను కృష్ణ
ఆనందునిసుతుడు ఆకృష్ణయగును
వేణువు నాపేరు వేడెద నిపుడు
వేణుమాధవు గాధ వినితరియించ



# బాల్యము - తల్లి - బిడ్డ



తనయొడి నిండిన తనయుని జూచి
తన వితీరమురియు తల్లియశోద
మురిమురి తిలకించి మమతను పంచి
మురిపాన సవరించు ముంగురులన్ని
సొపదాత్రమ్ముగ పాలిండ్లు తడుమ
కోపగించక నిచ్చు కొల్లగ పాలు
బుజ్జగించుచు తల్లి బుల్లిపాపడికి
బొజ్జ నిండుగనిచ్చు మురిపాల పాలు
చనుబాలు కుడుపుచు జాగరూకతను
కనులార బిడ్డను కనిపెట్టు చుండు
పలక మారుననుచు పదిలమ్ముగాను
పలుకరించుచునుండు పలుమార్లు తాను
త్వరితముగను పాలు త్రాగుచు బిడ్డ
చిరునవ్వు చిందించు చిత్రమ్ముగాను
సతతము బిడ్డను సంతోషపరచ
సతమతమైతల్లి సర్వమ్ముమరచు
ఆతనయునిగని ఆనందపడుచు
ఆతల్లి ప్రేమను అందించుచుండు
అల్లరి తనమున ఆట్లాడు బిడ్డ
తెల్లగ హారాలు సవరించుచుండు
గడగడ మని పాలు గళమునందుంచి
మెడలోన సూత్రాలు మెలిపెట్టు చుండు
పిల్ల వాడుక్కిరి బిక్కిరగునని

తల్లడిల్లుచునుతల్లి తలమీదనూదు
యెదపైన నిమురును ఎక్కిళ్ళు చూసి
పెదవుల నద్దును ప్రేమతో నమ్మ!
ఆరగించుచుపాలు ఆస్వాదనమున
గారాముగను బిడ్డ కరమున్విడువడు
పంటను నొక్కుచు పట్టుదలగను
తుంటరితనమున ।ధూ। యనియుమ్మ
దొంగ వేషమ్ముల దోబూచులాడి
కొంగు చాటునదూరికొంటెగనవ్వు
అమ్మకు పసివాని అల్లరియంత
కమ్మగలోచును కారణమేమొ!
ఎత్తుకు ముద్దాడ ఎదపైన తన్ను
చిత్తము నాతల్లి చిరుజల్లు తడియు
మృదువైన పదములు ముద్దాడినపుడు
పదముల రేఖల పసిగట్టెనమ్మ
చాపరేఖయునంకుశముచక్రములును
ఆపద్మ వజ్రరేఖాలంకృతములు
అరుదైన రేఖలా అరికాళ్లనున్న
అరుణి మన్ గని తాను ఆశ్చర్యమొందె
పారాడు వేళల పాపడి తీరు
మారాము జూడగ మనసంత నిండు
విడిపించుకొని తల్లి వెడల బోవంగ

పడిగను దుడుకుగ వాటేసు కొనును
తల్లి బిడ్డలలోన తన్మయత్వమ్ము
వెల్లి విరియు చుండువేడ్క మీరంగ
తల్లి – బిడ్డల ప్రేమ ధరణి యద్భుతము
కల్లకా నేరదు కపటమ్ము కాదు
నీరని తెలియదు నిప్పని లేదు
పారాడుచునుబిడ్డ పరుగిడు చుండు
కంటికి రెప్పగ కాపాడు చుండ
చంటి బిడ్డయెదుగు చక్కగనపుడు
బుడి బుడి నడకలు బుడతడు నేర్చి
తడబడి వేయును తప్పటడుగులు
గడబిడ నడుగిడు కడువడివడిని
పడిపడినడచుచు బహుసవ్వడి నిడు
బోరగిల బడిన బొబ్బట్లు వండు
నోరనవ్విన పంచునువ్వులుండలను
గడపలు దాటగ గారెలువండు

అడుగులకును అమ్మ అరిసెలు వేయు
నామకరణమాది నడకవఱకును
తామువేడుక జేయతల్లు లందరును
వేణువున్నామది వెల్లువై పొంగు
వేణుగోపాలునివినుతింతునెపుడు
తల్లియొడినిబిడ్డ తనరారు నటుల
నల్లనయ్యకరము నలరువేణువును
బాలచేష్టల గోపబాలునూహించ
కాలము గడచును కడుసుందరముగ
పసితనమునహరి పట్టి పూతనను
విసిగించి చంపెను వింతగొల్పంగ
ఆయద్భుత చరిత మావిచిత్రమును
మాయయు నెరిగిన మహిమయు తెలియ
వేణువునా పేరు వేలరాగములు
బాణీలవినిపింతు భాగవతమ్ము





# శ్రీ కృష్ణ లీలలు



వ్రేపల్లెలో నెల రేనిపగిదిని
గోపాలకృష్ణుండు కుశలుడై వెలిగె
తనవాత బడకుండ తప్పించుకొన్న
ఘనుడెందు గలడని కంసుండు వెదకె
తనకంట బడగనె దండించనెంచి
తన భటులను బంపి దయమాలియుండె
యదువంశతిలకుడై యశమొందు చున్న
యదునందనుడె తన యముడనియెంచె
పసివాడు కృష్ణుని పరిమార్చుటకును
అసుర వనితనంపె నా కాలనేమి
పూతన నామమ్ముపూబోడి యొకతె
చేతుల గాజులు సింగార మొలుక
వాలు జడను పూలు వయ్యారి తనము
వాలు కనులనెల్ల వగలు బోవుచును
ఉబ్బిక చేయుచు మంచిమాటలను
వచ్చెను కృష్ణుని వధియింపబూని
ముద్దు కృష్ణా! పాలు ముచ్చట నిత్తు
వద్దుచేయక నీవు చంకనెక్క మనె
విప్పారు కన్నుల విస్మయమ్మంత
గొప్పగనటియించె కొంటెకృష్ణుండు
అంగనను గని రమ్మనగనె జని
చెంగు చంగున చెంగు చేరెను చక్రి
అనంతయును క్రొత్త అనకుండ నవ్వి

ఆయింతి చెంతను ఆకృష్ణుడమరె
పూతన కృష్ణుని పొత్తిళ్ళ నుంచి
చేతను చనుబాలు చేవుచునిచ్చె
క్రొత్త కోమలిగని కొమ్మలందరికి
చిత్తములను శంక చిత్రమ్ముకలిగె
కానికలికికడకన్నయ్య నగుచు
కానవచ్చెను పాలుకావలె నంచు
యింతికి చేతుల నిమిడిన చక్రి
వింతైన చేతల విలసితుడయ్యె
భీతియనకపాలు ప్రీతి గై కొనుచు
భ్రాంతికలుగగ విభ్రాంతులంజేసె
ఏనోమునోచెనో యీ మగువయని
తానుగ నొక్కక్క తరుణి యోచించె
చిచ్చర పిడుగు యీ చిన్నికృష్ణుడని
అచ్చెరువందెను ఆయశోదమ్మ
అద్దాల పవళించి అదును చూసుకొని
అద్దమ్ముపడవేసె అసురను హరియు
పెనుగాలితరువును పెకలించినట్లు
కనివినియెరుగనిగతి కూలదోసె
లలితాంగి లాలన లావణ్యమంత
కలవోలె కరుగగ కాయమ్ముమిగిలె
బానవంటికడుపు బరువైన తనువు

దానవి యరచుచుధరణిపై యొరిగె
వాలిన యూడల వటవృక్షమట్లు
రాలిన సౌధమ్మురాశిని బోలి
కూలిన రక్కసి కొండను జూసి
జాలిగ నవ్వెను సానుభూతిగను
మూలము నెరిగినమురళీధరుండు
బాలకృష్ణునినవ్వు పసిడి పండించె
ఆయువు చెల్లిన అసుర వనితను
పోయి చూసిరి వింత పురములోనంత
పూతన కన్పట్టె భూతమ్ము పగిది
భీతిల్లి పిల్లలు పెద్దలు కూడ
అమిత వికృత రూపి ఆనిశాచరిని
యమపురి కంపిన హరినిపొగడిరి
కసిగందు చేసినఘనకార్యమగుట
వసివాడ నట్టి యావదనమ్ము గనగ
ఒడలు జలదరించి ఒక్కొక్కరపుడు
విడువక కృష్ణుని విష్ణువెయనిరి
చనువుగ నేతెంచిచను బాలనిచ్చి
చనిపోయి పూతన చరితార్థ అయ్యె!
బాలకృష్ణుని ఆట పాటల దేల్చి
పాలిచ్చి జీవమ్ము బాసినందులకు
తాను జేసిన పూర్వ తపముఫలించి
దానవి యుస్వర్గ ధామమ్ము జేరె
అక్కున జేర్చిన అమ్మకు నగుచు

మక్కువ తీర్చెను మాధవుండపుడు
ఇద్దరు తల్లుల యింపగు బిడ్డ
ముద్దుగ కృష్ణుడు మురిపించు చుండు
ఊయలలో బిడ్డ ఊరంత వెలుగు
సోయగమ్మును చూడ శోభిల్లు చుండు
ముద్ద మురిపెముల ముదితలందరును
ప్రొద్దంత కృష్ణుని పూర్తిసేవింత్రు
లాలపోసిమురియు లలనలు గూడి
జోల పాటలు పాడి జోకొట్టు చుంద్రు
అందాల కృష్ణుండు అవతారమూర్తి
ఇందీవరాక్షుండు ఎందైన కలడ?
అనుచుమురిపెమున హరినిసేవింత్రు
మనసుల నిండుగ మమత వహింత్రు
కళతెచ్చునుదుటను కస్తూరి బొట్టు
తళుకు కౌస్తుభమణి దనరువక్షమ్ము
కర్ణాభరణములు కంఠాభరణము
వర్ణనాతీతభావమ్ముగ నొప్పు
నెమ్మది నమరించు నెమలిపింఛమ్మ
నెమ్మదిమురియగ నెలతలందరును
కరమునవేణువు కదలక యుండు
శిరమున స్థిరముగ శిఖిపింఛముండు
కాళ్ళకుగజ్జెలు కరకంకణములు
వ్రేళ్ళకునంగుళుల్ వెలుగొందు చుండు
తల్లియశోదకు తనయుడెయన్ని



ఉల్లమునను వాని ఉన్నతి గోరు
వెన్నముద్దలు తీసి వేడుక తీర
కన్నయ్య తినుచుండ కనులారగాంచు
పీనాంబరముకట్టు చిన్ని కృష్ణునకు
ఏనాటి పుణ్యమొ ఎన్నగతరమ?
నీలమేఘముఛాయ నీరజాక్షుండు
బాలుడై మురిపించు పరమాత్మయతడు
వెన్నచిలుకుతల్లి వెన్నుపై వ్రాలి
కన్నులుమూయుచు కడుమురిపించు
తల్లియశోదయు తప్పురా! యన్న
మెల్లగ పెదవిని మెదుపకయుండు
వెన్నముద్దను తీసివ్రేలితోపులిమి
చిన్నగ చేయును చిలిపి చేష్టలను
వెన్నదొంగను పేరు వెన్నుడైయుండి
చిన్ని కృష్ణుడు పొందె చిరుప్రాయమందె
తోటివారికి వెన్న తృప్తిగపెట్టి
సాటి చెప్పను తానె సాటి తనకని
సురలకు చక్కగ సుధనంతపంచి
హరిజూడ నవనీత హరుడుగ మిగిలె
నిధియందు వెన్నంత దాగియున్నటులె
గుడియందు దాగుండు మంచితనమ్ము
చిలికిన మజ్జిగ చిక్కునువెన్న
చిలికినపుట్టును మనసున భక్తి
వెన్నవంటి మనసు విలువైనదనుచు

వెన్నను గోరుచు వెన్నుడు తెలుపు
పరిపక్వహృదయమ్ము పావనంబగును
హరిమెచ్చి వసియించు హర్షమ్మునందు
సున్నిత మగు మనసున్న చాలు
సన్నిహితుడగును శౌరియెల్లరకు
భక్తుల మనసుల భగవానుడుండు
ముక్తినొసగునమ్మి మ్రొక్కినయంత
మురహరికరమున మురళీరవళిని
అరయుచు నుడివెదహరివరవడిని
బువ్వతినెడు వేళ బుంగ మూతిగని
అవ్వ! యనియశోద ఆశ్చర్యపడును
అందెల సవ్వడిన్ అలిగిపరుగుల
అందందు తిరుగుచు ఆట్లాడుచుండు
ముందుగ మారాము ముద్దుల గుడిచి
అందియు అందక అలరించి తినును
కరకంకణమ్ములు గలగల మనగ
తరుణుల వెంబడి తరుముచునుండు
ఆబాల గోపాల మాబాలకుడిని
ఆబలమును జూచి ఆనందపడుచు
పెన్నిధి దొరికిన పేదల వోలె
సన్నిధి వీడరు క్షణమైన వారు
నీడవలె సఖులు నిలువ వెన్నంటి
తోడుగ కృష్ణుడు తోడ్కొ నిపోవు
కష్టము వచ్చిన కడతేర్చుదునని

సృష్టము చేయును సర్వోపగతుడు
సద్భావ సంప్రాప్త సద్భక్తి పరుల
ఉద్భవించి మరియు నుద్ధరించు హరి
అధరమ్ము వేణువై అమృతమ్మునంది
మధురమై యొప్పుదు మాధవ యనుచు
శ్రీకృష్ణలీలలు శ్రీఘ్రమ్ము వినగ
ఆకృప నెరిగింతు నానందముగను
వేణువు నాపేరు వేలరాగముల
బాణీల వినిపింతు భాగవతమ్ము
యదునందనునట యాదవులంత
సదయహృదయునిగ సన్నుతించుదురు
బాలుడు శ్రీకృష్ణభగవానుడనుచు
కాలము శాంతి సౌఖ్యములను గడుపు
అసురు నుసురుతీయ హరియొకపరిని
కసుగాయ కాదమ్మ గడుసరియనిరి
ధేనుకాసురుజంపి ధీరుడై నిలువ
తా నసామాన్యుడు దైవమ్మెయనిరి
శకటతృణావర్త సహితమ్ముదునుమ
అకట! బాలుడుకాడు ! అచ్యుతుడనిరి
బాలకృష్ణుని జంప పలువురు వచ్చి
కాలము చేసిరి కాలుని జేరి
దినదినగండమ్ము దీర్ఘాయువనగ
ఘనముగ పెరిగెనుగారాబు బిడ్డ
గట్టిగనల్లరి కన్నయ్య చేసి

మట్టిని భక్షించు మాధుర్యమనచు
మన్నుతినినచాల మంచిదె యనుచు
చిన్ని చేతుల జూపు చిలిపికృష్ణుండు
మట్టితినవలదు మాధవయన్న
గట్టిగ సఖులకు కబురులు చెప్పు
నేలను, నింగిని, నీటను నేనె
గాలిని యగ్నిని కలిసి యుండెదను
అంతట నేమందు అన్నియునేనె
ఎంతయెకృష్ణుడు ఎరిగించనెంచు
చిన్నవానినిగని చిన్నినోట విని
మిన్నగ నెంచియు మిన్నకుండకను
పిల్లవానికి చాల పెద్ద మాటలని
తల్లికి తెలిపిరిదండన జేయ
కన్నయ్యకన్నుల కన్నులుగలిపి
కన్నులెఱ్ఱగ తల్లి కన్నులనురిమె
కలవరపడి తల్లి కఠినమ్మునడగ
నిలిచెను కృష్ణుడు నిర్లిప్తముగను
మందలించగ నమ్మ మారాడ కుండ
బందీగ నగుచు తా భయమునటించు
చిరునవ్వునా తల్లి చిరుకోపమంత
మరునిమిషములోనె మాయము జేయు
తల్లియు బెదిరించి తర్జని జూప
మెల్లగ కృష్ణుడు మెదుపు నాస్యమ్ము
కొంటెనాలేకయాకొంటినా నేను



తింటినా? మంటిని? తీర్పుచెప్పమ్మ
నీగోరుముద్దలె! నే నిష్టపడుదు
నేగోర నేమట్టి నేనేమి తినను
కమ్మగతినిపించి కడుపును నింపి
అమ్మరో! నన్నుంపి అనుమానమేల?
నన్నునమ్ముము చాలు నా పైన యాన
మన్నునేతినలేదు మధురిమ నెరుగ
కాదన్న వీక్షించుకారణమ్మెరుగ
లేదన్న శిక్షించు క్లేశమ్మువీడి
అసలురాదమ్మరో అనృతమ్ము బలుక
అసహజముకదమ్మ ఆమన్ను తినుట!
చల్లగ సఖులంత చాడీలు చెప్పి
కొల్లగ తెచ్చిరి కోపమ్ము నీకు
విశ్వసించకు తల్లి! వీరి మాటలను
విశ్వాసహీనులు వీరలోయమ్మ
అలుగుచు కృష్ణుడు అమ్మకెదురుగ
నిలిచి మెల్లగ నోరునిండుగ తెఅచె
తల్లి నోటను జూపపూర్తి విశ్వమ్ము
తల్లియు జాండమ్ముదర్శించెనందు
నటనమ్ము నాతల్లి వర్ణించ లేని
ఘటమును విస్మయమ్మును పొందె నపుడు
తన్నుతాను మరచి తల్లియశోద
కన్నులరెప్పలు కదుపలేకుండె
కనులు మూసిన తాను కనగ లేనేమొ

అనియామె కనుచుండెనధికయాతృతను
నేత్రమ్ములన్ జ్ఞాన నేత్రమ్ము తోడ
ఆత్రమ్ము సాగించెనవలోక నమ్ము
తానందులీనమై తనవి తీరగను
ఆ నందనుం గాచె ఆనందుని సతి
విస్మయమ్మున విశ్వవింతలగనుచు
విస్మరించెను తన విశ్వాసమంత
కాయమధికముగ కంపించుచుండ
మాయతెరనుదించెమాయావిచక్రి
ఉత్సాహమున నామె యెడలు ఝల్లనగ
తత్సార మెరుగక తత్తరపడియె
ఇలనేను నేనేన? యిదియేమివింత?
తలచగలన? తనయునీరీతి?
విశ్వవిభుడ ? లేక వేణులోలుండ?
ఐశ్వర్యమననాదె ఐనదీనాడు!
కలకాదు కదతండ్రి కల్ల కాదుకద
కల వరమందున కలవరపడన?
తనలోన తానట్లు తలబోయుచుండి
కనలేని లోకాలు కనగల్గె నామె
ఇహలోకమును వీడెఇంతిమానసము
సహకరించక నుండె సకలదేహమ్ము
పదునాల్గు భువనాలు పరమాత్మ జూప
పదిలముగ యశోదపరికించె నంత
నదులును, నగములు, నక్షత్రములను

మదిసూర్య, చంద్రుల మహిగాంచగలిగె
పశుపక్షి జాలమాపై జీవరాశి
విశదమ్ము వింతలు వీక్షించగలిగె
కడలిని, గగనమ్ము కనగల్గు చుండ
తడబడెవివశయై తరుణి యశోద
ఆనందనందను నరయంగ కురిసె
ఆనంద బాష్పాలు అవధి లేకుండ
మోనముద్రను దాల్చి ముదితయశోద
ధ్యానము చేసెను తాకన్నదంత
మహిమనుజూపమైమరచిన తల్లి
సహజముగ సుతుని సందిటజేర్చె
అమ్మకు కృష్ణుడు అక్కున జేరి
కమ్మని అనుభూతికలిగించెనపుడు
తనకు మాయతెలియదనుచునె తెలిపి
తనలోని విశ్వమ్ము తల్లికి జూపె
గతజన్మనుయశోదకడుభక్తురాలు
అతులిత సేవను అలరించెహరిని
పూర్వజన్మను భక్తి పునరుద్ధరింప
పూర్వములేనట్టి పుణ్యమ్ము నొసగె
సర్వమ్ము మిథ్యను సత్యము తెలుప
సర్వము జూపెను సర్వేశ్వరుండు
జగపతి సత్యము జగమంత మాయ
తగురీతి నెరిగించె తల్లికి హరియు
విశ్వరూపము జూపి విశదమ్ము జేసె

విశ్వమ్ము తానును వేరు కాదనుచు
జగమంత జననికి జ్ఞాన నేత్రముల
తగినంత జూపుచు తనయుక్తి చాటె
అంతనదృశ్యమై అద్భుతములును
చింతన కృష్ణుని చెంతకు మరలె
మాయజేయగ హరి మాయను తిరిగి
ఆయశోదయుబొందె అసలు మాయనట
సుంతజాగనకను సుదతియశోద
కొంత లాలించెను కొంత కోపించె
కృష్ణమాయకులొంగికినిసి యా తల్లి
కృష్ణుని దండింపనెంచినదపుడు
మాయకులోనైన మాతయోచించె
మాయమాటల వాని మరివేయు శిక్ష
గట్టిగ రోటికి కట్టిపెట్టగను
పట్టిని పట్టగ పరుగులుపెట్టె
అందియు నందక హరి మురిపించి
అందందు తిరుగుచు ఆటపట్టించె
నా బిడ్డవని నమ్మి నానయ్యనిన్ను
నా బిడ్డగనె నిలు నారాయణ యనె
దైవమ్ము నీవైన తల్లిని కాద
భావమ్ము గ్రహియించి పట్టుపడమనె
అలసిన అమ్మపై అభిమానమునను
తలచెను కృష్ణుడు తాను చిక్కగను.
శివునకు బ్రహ్మకు సిరికిని గాక



చివరకు తల్లికి చిక్కెప్రేమకును
త్రాడును కట్టగ తల్లితపనను
వేడుక జూచెను వెన్నుడు తిరిగి
బుజ్జినడుము కట్టుపూర్తిగాకుండె
రజ్జువు దాలక రభసగనుండె
ఎంతత్రాడు నుతెచ్చి ఎటుల కట్టినను
సుంతైన కొరవడు చుండె నా త్రాడు
మాయకులోబడి మనసునక్రుంగి
ఆయశోదయుమునిగె ఆశ్చర్యమందు
బిత్తర చూపుల బిడ్డను గనుచు
తత్తర పడసాగె తల్లియశోద
కన్నులందున జాలి కపట భయమును
చిన్నికృష్ణునిగన చిత్రంబుదోచె
బ్రహ్మాండ భాండమ్ము బ్రహ్మోద్భవమ్ము
బ్రహ్మము సకల సంభరిత మా బొజ్జ
బంధింపగవశమ? పరులేరికైన?
సంధించిభక్తిని సాధించతరమ?
నిజముగనిజమైన నిజమెరిగున్న
సజలనేత్రజనని సరిదిద్దబోన?
కొంత తేరుకొనుచు కొమరునిజేరి
వింత గొలుపు నిది విపరీతమనియె
ఇదియేమి చిత్రమొ ఏమిసేయుదును?
పసిబాలుడను కొన్న మర్యాదకాద?
శిక్షించకునన్ను నిటులగోవింద

వేడుకొందును నిన్ను వేణుగోపాల
బంధించ బూనియుబ్రతిమాలు చుంటి
సంధించ బోకుమీ సత్యాగ్రహమ్ము
కట్టుబడగదయ్య కరుణించినన్ను
పట్టు విడచి నీవు పట్టు బడమనె
లీలలు చాలించి లీలావినోది
బాలునిగ తిరిగి బందీగనిలిచె
నేను కట్టుట కాదు నీవెకట్టుబడ
నౌనన, చిక్కెను నవ్వికృష్ణుడును
అంతయుదైవమె అనుసత్య మెరిగి
స్వంతము లేదన్న జరుగును శుభము
తనయనుగ్రహమున్న ధన్యులంజేయు
తనయాగ్రహమ్మున దండించును హరి
సుకుమారి రోటికి సుకుమారముగను
సుకుమారు బంధించశుభమనె సురలు
అమ్మనటుల బంపి ఆకృష్ణుడపుడు
నెమ్మది నెంచెను నేర్పును జూప
రొప్పుచు కృష్ణుడు రోటిని యీడ్చి
కుప్పగ గూల్చెను కోరిమ్రానులను
నారద శాపమ్ము నలకూబరుండు
మారె మణిగ్రీవుమారె మానులుగ
శాపమ్ము బాపిన శౌరిని గాంచి
ఆపైన నర్పించిరవ్వారునతులు
తలచి బిడ్డకు దిష్టితగిలిన దంచు

చిలిపికృష్ణుని గూర్చి చింతించెతల్లి
ముల్లోక మునకును మూలమాతండ్రి
తల్లియై మురిసెనాతండ్రికి నామె
కనగతోచును మాయ కన్నయ్య లీల
తనయుడై చూపెను తల్లికి కొంత
చూసిన దాతల్లి సుంతైన గాని
మోసెను కొండంతమోదమ్ముమదిని
భ్రమలను కల్గించి ప్రజలకు తాను
క్రమముగ వారిని కాపాడునుహరి
జగమంత తానెయై జగమేలు హరికి
పగవారు తనవారు పట్టింపు లేదు
జగమంత వేదిక జనులంతనటులు
జగపతి యాడించు చతురనాటకము
మానుష విగ్రహమాయావినోది
మానవులందరు మాధవహితులె

సద్భక్తి కలిగించు సత్వగుణమ్ము
సద్భావములు దెచ్చు సద్గతిమనకు
భక్త్యంజలి ఘటించి భగవాను నమ్మి
శక్త్యను సారము శరణన్న జాలు
ఆశ్రిత వత్సలు డాపరమాత్మ
ఆశ్రీహరిమనల నాశీర్వదించు
పరమభక్తులకైన పరమాత్ము దెలియ
తరమ? దామోదరు దయగనకున్న!
పరిశుద్ధయాత్మను పరమాత్మ మెచ్చు
వరమిడితానందు వసియించుచుండు
వినిపింతు నెప్పుడు వేణుగానమ్ము
అనిపింతునెప్పుడు హరికీర్తనములు
వేణువు నాపేరు వేలకు వేలు
బాణీల పాడుదు భాగవతమ్ము





# కాళీయమర్దనము



తూరుపుదిశసప్తతురగరథమున
ధారుణి భానుడు తరలుచువచ్చు
సులలిత కిరణముల్ నులివెచ్చదనము
జనులకుమేల్కొల్పు జగతికి వెలుగు
ఆకుల సందుల ఆకిరణములు
లోకగతరువులు సొగసుగనొప్పు
అవనితుషారము అద్దినట్లుండ
ధవళకాంతులనొప్పు తరువులు జూడ
మంచుబిందువులన్ని మంచి ముత్యముల
మించగ పులకింత్రు మేదిని జనులు
ఆకాశము వివిధ ఆకారములను
సాకారముగ మేఘశకలముల్ గూడు
సుందరదృశ్యము సుప్రభాతమున
అందరు తిలకింత్రు అహ్లాదమెసగ
పశుపక్షి గణమును పయనమౌనింక
దిశదిశల్ మేతకై తిరుగాడుటకును
గోపబాలురు కూడ గోవిందుజేర
కోపగించక పంపు కోరితల్లులును
ఉదయానె చల్దులు ఊరగాయలును
కుదురుగ సర్దియుకూరిమి నిచ్చు
కొసరి కొసరి తినుగోవిందుడెపుడు
ముసిముసినగవుల మురిపించుచుండు
పిల్లలు గుమిగూడి ప్రియమిత్రునికడ
అల్లరి చేయుచు నాడిపాడుదురు

గోవుల దోడ్కొని గోప బాలకులు
ఆవేణు గోపాలు ననుసరించెదరు
వనమున విహరించువనమాలిగాంచ
కనులెన్నొ నెమలికి కలిగెపింఛమున
ఫలపుష్పభరితమై పాదపమ్ములును
అలకొమ్మలను చేతు లాహ్వాన మనును
విరితావియంతట వెల్లివిరియగ
విరివానకురిపించు వెన్నునిపైన
మత్తకోయిల పాడు మధుర గీతికలు
చిత్త మరల బల్కు చిలుకరమ్మనుచు
సందడిన్ స్వాగత సంబరమునను
ముందుకు నడుచును మురళీ ధరుండు
వేణుగాన లహరి విలసిల్లువనము
వేణువు విని నదుల్వెలయించుముదము
తమ తరంగముల హస్తమ్ములనదులు
సుమనోహరు గొలువ సుముఖులై యుండు
తమవంశ వేణువున్ తరువులు మెచ్చి
సుమములు కురిపించు చూడముచ్చటగ
గోపికల్ సఖులు గోవులు కూడ
గోపాలుని మురళిన్ గ్రోలగ గోరు
కన్నుల, వీనుల కన గను, వినగ

కన్నయ్యను మురళీ గాన మాశించు
ఆలేగ దూడలు ఆలకించి మురళి
పాలుత్రాగుటమాని పరవశమ్మొందు
బాలుడై యాగోపబాలుడై హరియు
ఆలమందల గాచు ఆర్తులంగాచు
అడవిని తలబడు ఆపదలన్ని
గడుసుగ కృష్ణుడు కడతేర్చు చుండు
కావగ గోపుల కాపరులనట
దావాగ్ని ధూమమ్ము తానుమ్రింగె హరి
బక రూపమునతమ్ము బలిగొనవచ్చు
ఒకరక్క సుని ముక్కు ఒడుపుగ జీల్చె
కొండను బోలిన కొండచిలువను
కండలు పీకెను కంఠమ్ము పెరికి
అసురుల జంపుట ఆట కృష్ణునకు
వసుధనేలు ప్రభువు వాసుదేవుండు
ఆ యదుబాలుర నాగోగణమును
మాయజేసి విధాతమాటున నుంచ
కన్నట్టి వారికి కలత లేకుండ
ఉన్నట్టె బాలుర యునికి సృష్టించె
వర్షమ్ము వరుసగ వారినింబోలి
హర్షమ్ము కలిగించె ఆప్తులకు హరి
తనమాయ మించిన తండ్రి మాయకును
మనమునవిస్మయమందె నా బ్రహ్మ
ఆలమందల గూడి ఆబాలురంత
గోల గోలగతిరుగు గోపాలు వెంట
అంబర మందున అంబుదాలవలె

సంబరముగ జను చక్రికి వెనుక
వరుసగ కదలెడు వారిదములన
హరిని ననుసరించి అరుగుచునుంద్రు
మిన్నున యా నీలిమేఘమ్ముపగిది
కన్నయ్యభువిపైన కనిపించుచుండు
ఆకస మందున ఆమెరుపువలె
ఆకృష్ణుని మధుర హాసమ్ము మెరయు
నెమలిపింఛము నొప్పునింద్రధనుస్సు
కమనీయ వర్షము కనులలో కరుణ
ఏభాగ్య వశమునయిలను వెన్నంటి
ఆబాలకులుహరి అభిమానులైరి
హరిసన్నిధానమ్మే హర్షదాయకము
మరిమరి గొలుచుచుమదినమ్మినారు
బాలలందరు గూడి బాగుగ నాడి
కాలము చక్కగగడుపుచునుంద్రు
పేరుపేరున చక్రి పిలుచు గోవులకును
ఊరుచేరగ సంధ్య నురుకునన్నియును
దినకరునికిరణదీప్తికి పసిడి
ఘనతను మెరిసెను కాళింది జలము
వరుసగ పక్షులు వ్రాలబోవగను
పరవశమొందుచు పశువులు వచ్చె
నీరముగోరుటె నేరమైనటుల
తీరము జేరగ తీవ్రత నొందె
నీటిని త్రాగెడు నిముషమునందె
నీటినితేలిరి నిర్జీవులగుచు
పరకించి కృష్ణుడు పరుగున వచ్చి



కరుణించె వారిని కరమున తాకి
తల్లని చూపుల జల్లియమృతము
మెల్లగ కృష్ణుడు మిత్తినితరిమె
కాళిందిని జనులు కడగండ్లు పడగ
కాళీయుని విషమెకారణమయ్యె
కాళీయుడను నొకకాలసర్పమ్ము
కాళిందినదిలోన కాపురమ్ముండె
గరుడుని గండమ్ము గడువగ నహియు
తరుణులతో గూడి తలదాచుకొనియె
విషనాగు వసియించి విపినమ్ము నదిని
విషమును గ్రక్కుట విధి విలాసమ్ము
కసులార నావిర్లుగ్రక్కుటగనుచు
జనులానదిని జేర జంకుచునుంద్రు
వారు జలకమాడ వలను కాదచట
కోరిదాహము దీర్చు కొనగనులేరు
బలియగుచున్నట్టి ప్రాణులగావ
తలచెను కృష్ణుడు దయ తలచియును
గిరిగజమును బోలు మడుగున ఫణిని
కొదమసింగము చంపకోరినట్లురికె
ఒక్కపాటున హరియుదకమ్ము దుముక
చిన్నికృష్ణుని జూడ చేరిరి జనులు
హరిగూర్చి చింతించి ఆతురతగను
అరచిరి హరి హరీ అనుచు మరిమరి
ఎలుగెత్తి పిలుచుచు ఎదురు తెన్నులుగ
పలువురు పలుమార్లు పరుగెత్తువారు
ఎక్కడ కృష్ణయ్యా? ఎక్కడున్నావు?

చక్కగ రమ్మిక జాగుసేయకను
ఆడుచు పాడుచు అలరించుచుండి
వేడిన వెంటనె వెత దీర్చు చుండి
వెంటను త్రిప్పుచువింతలు జూపి
కొంటె నవ్వులు నవ్వుకృష్ణుడవనుచు
పరిపరి విధముల పరితాపమునను
విరివిగ సఖుతెల్ల విలపించు చుండ
బాలుడని హరిని భావించు వారు
కాలుడు కృష్ణుని కడతేర్చుననిరి
నారాయణుండని నమ్మినజనులు
వీరుడై సాధించు విజయమ్ము ననిరి
పరిపూర్ణ విశ్వాసబలమున్నవారు
సరిజేయుశ్రీహరి సర్పమ్ముననిరి
అల్లరి కృష్ణుని అరయగలేక
పిల్లలు రోదించ భీతిల్లియచట
వార్తను విన్నంత వణికి పోవుచును
ఆర్తనాదముజేసె ఆయశోదమ్మ
తల్లిదండ్రులు వచ్చితహతహలాడి
ఘొల్లు మనిరివారు గోపాలు కొరకు
భ్రమలోన తల్లి విభ్రమము చెందంగ
మమతను కుమిలెను మాతృహృదయము
వెన్నునిగానక వెత నొంది తల్లి
కన్నీరు మున్నీరు గనువిలపించె
గుండెజారగతల్లి కొడుకాయటంచు
నిండుగ పిలుచుచు నీటినిగాంచె
ఏజాడ లేదేమి? ఈ జాగదేల?

ఏజాతి జంతువో ఏమున్నదచట?
నీటను మునిగిన నీకెవ్వరేమి
చేటును తలబెట్టి చేతురో తండ్రి!
కాళీయసర్పమ్ముగరళము చిమ్మ
కేళీవినోదమొక్కింత చాలించు
వేగమెకనిపించి వేదనతీర్చు
వేగలేనింక నేవెదుకంగలేను
తల్లియావేదనతరగనిదగుట
ఉల్లము నొల్లక ఓర్పుకోల్పోయె
నందుడునందను నగుమోముదలచి
ముందుగ ధైర్యము ముదితకు జెప్పె
ఆరాట పడకంచు అర్ధాంగినతడు
ఆరాట పడసాగె అధికమ్ముతాను
కన్నీటి తెరమధ్య కనులప్పుజెప్పి
అన్నీట జూచిరి ఆవేదనగను
అడుగిడ హరి మడుగడుగున ఫణియు
గడబిడ తడబడి గడగడలాడె
హరిదుష్టశిక్షణనహిగర్వమణచి
భరతము పట్టెను పడగలపైన
మడుగులరక్తపుమడుగును గనుచు
వడివడి నఱచిరివాసుదేవయని
స్పృహతప్పె తల్లినిస్పృహచెందితండ్రి
ఇహమునునురచిరి యేమైనదనుచు
ముందుగ మురిపించె మురళీరవళియు
విందును గూర్చెను వీనులనిండ
వినవచ్చె మెల్లగ వేణు గానమ్ము

కనవచ్చె చల్లని కన్నయ్య మోము
నాదము మోదమ్మునలరించెనచట
నాదమ్ము చిత్రమ్ము నర్తించె ఫణిని
మోదమ్ముతోడను ముద్దు కృష్ణగని
ఖేదమ్ముతొలగంగ గెంతిరిసఖులు
అల్లనల్ల సలీలుడరు దెంచునపుడు
వెల్లివిరిసెనంత వింతతేజమ్ము
ఉదయించు బాలసూరుని వోలె వెలిగి
మదిలోనితిమిరమ్ము మలగి పోదరిమె
కాళీయుశిరమునకాలూని నదిని
తాళము వేయుచు తాండవమాడి
మువ్వగోపాలుడు మురిపించుచుండ
సవ్వడి మానిరి సంభ్రమంబుగను
తకధిమినాట్యము దరువును జూచి
సకలము నాదైవ సంకల్పమనిరి
కనులార తిలకించ కరివరదునట
తనువెల్ల పులకించె తల్లిభాగ్యమన
పలుకు పలుక లేక పలుకరించగను
పలుకసాగె హృదయ ఫలకమ్మునందు
బాలునకింతటి బలముండు టేమి?
చాలును కృష్ణుడసాధ్యుడె జూడ
గొల్లభామల జేరి గోలపెట్టించు
అల్లరి కృష్ణుడు అసలుకాదమ్మ
పలుమార్లు కృష్ణుని ప్రతిభను తలచి
పలురీతి తల్లి దండ్రి పలవరించిరట
ఆయశోదానందు లానంద మొంద



వేయినోళ్ళ పొగిడె వేలాదిమంది
విషధరు శిరమున విలయతాండవము
విషధర శయను డావిధి జేసెననిరి
పూవులు జల్లిరిపురుషోత్తముగని
ఆవులు అరచెను అంబాయనుచును
కోలాహలముగ పక్షులు యెగురంగ
మేలగు సందడి మేళ వించెనట
పడగలపై బడ పాదముద్రలును
పడగల నర్తించె పరమాత్ముడతడు
గర్వమ్మునణుచుచుఘనుడు కృష్ణుండు
సర్వము తానను సత్యమ్ము తెలుపు
తరలగ సర్పము దర్పము వదల
శిరమున కృష్ణుడు చిందులు వేసె
శ్రీహరి పదములు శ్రీలక్ష్మి యొత్తు
ఆహరి పదముద్ర లహి పైన బడియె
క్షీర సాగరకన్య కేలందువేళ
క్షీర వారిధి కడిగిన పాదములవి
శ్రీపాదములె జేసె శిలనహల్యగను
ఆపాదముల గంగ ఆవిర్భవించె
బలుప భక్తి కడుగునట్టి పాదములు
బలినణచిన యట్టి పాదపద్మములు
అట్టి పాదమ్ములు అతిపుణ్యఫలము
గట్టి ముద్రను వేసి కరుణించె ఫణిని,
ఆ పాదరజము పునీతులంజేసె
గతపాపముల బాపి మన్నించుమనుచు
పన్నగు పడతులు భక్తి నర్థింప

వెన్నుడు క్షమియించి విడిచె కాళీయు
ముందుకాళీయుని ముదితల గాంచి
నందకిశోరుడు నవ్విదీవించె
అతులిత బలశాలికంజలించుచును
సతుల గూడియు వీడె సర్పమ్ము మడుగు
విషనాగు వెడలిన వెనువెంటనచట
విషమంత విరిగెను విష్ణునిదయను
విషపూరితజలము విషమువిరిగెను
విషవాయువులు కూడ విమలమై వీచె
వాతావరణమున వరుస కాలుష్య
మేతావు కానక ఎగిరిపోయెనట
పిన్నవయసులోన పెద్దరికముగ
మిన్నగ యశమొంది మేలుజేసె హరి
జీవము పొందిన జీవరాసులును
దేవుడే కృష్ణుడై దిగి వచ్చెననిరి
అభినందనలు చెప్పిరభి మానులంత
అభివాదములు జేసిరభయహస్తునకు
అనలమై దహియించి అఘములను హరి
అనిలమై వ్యాపించి ఆపదల్తరుము
పరిశుద్ధ ఆత్మను పరమాత్మ మెచ్చు
వరమిడి తానందు వసియించుచుండు
గర్వాంధకారము కరిగించి హరియు
సర్వత్ర వెలిగించు జ్ఞానమ్ము దివ్వె
వేణువు నాపేరు వినయము తోడ
వేణమాధవు కథల్ వినిపించుచుండు

# శ్రీ కృష్ణుని లీలావినోదము



నవనీత చోరుడు నందునిసుతుడు
భువనైక సుందరంబుగ నొప్పుచుండు
పసితన మందునె పదుగురి మెప్పు
పసిడి నవ్వుల దోచు బాల్య చేష్టలను
పరిహాసముల నాడి ఫక్కున నవ్వి
దరహాస చంద్రి కల్ ధరనుపండించు
ముద్దుగ జగడాలు ముచ్చట బెట్టి
పొద్దుపుచ్చు నిరుగు పొరుగు వారికిని
రేపల్లె యందున రేయింబవళ్ళు
పాపడై కలుపును పాలును పెరుగు
వింటివాయని అత్త వెంటను తిరుగు
కొంటె పనులు జేసి కోడండ్ర జూపు
కోడలి నాయత్త కోపగించంగ
కొడుకునకు జూపు కోరి కృష్ణుండు
ఆలుమగలజేరి ఆటపట్టించు
మేలు జంటయనుచు మేలమాడుచును
ఇంటిగుట్టును బట్టి యిట్టె రట్టుగను
ఇంటింటబెట్టుబో ఈకొంటె పట్టి
దొంగవేషమ్ముల దోబూచులాడు
దొంగిలించియువెన్న దొరలాగవెడలు
వెన్నతింటివ లేద? విన్నవించమని
తిన్ననుతినమని తిని, తినిపించు
పాలభాండముగొట్టి బలిమి రంధ్రమును

బాలకులకు పట్టుపాలధారలను
ఆరబోసెనుభువి హరికీర్తియనగ
పారబోసెను హరిపాలును పెరుగు
కడవలు గొట్టి సగర్వమ్ము నిలువ
పుడమిని వ్యాపించె బుడతనిఘనత
ఉట్టిమీదను వెన్న ఉండనియ్యడిక
గట్టిగ గదిమిన గారాలుగుడుచు
పడరాని పాట్లను పడుచుంటిమమ్మ
గడసరి కృష్ణుని కట్టివేయమ్మ
ఈల వేసివిడుచు నెల్లదూడలను
పాలకొఱత వచ్చెపసిపిల్లలకును
పరిపరి విధముల బాలుని పనులు
విరిబోణు లందరు వినిపించె గోడు
తరలివచ్చి నుడువ తల్లియశోద
కరువయ్యె మాటలు కలతనుచెందె
బుంగమూతిని బుడి బుడి దీర్ఘముహరి
కొంగు చాటున చేరుకొను తల్లి చాటు
అల్లరి కృష్ణుని ఆగడమ్ములకు
గొల్లభామలు పెట్టు గోడువినగను
తల్లికి యుల్లము తల్లడిల్లగను
చల్లగ వారిని సాగ నంపెనిక
నేరమ్ము నిందలు నెలతలువేయ



భారముగతలచె భావినాతల్లి
ఇంతకు తెచ్చె నన్నీ కృష్ణుడంచు
చింతించెను యశోద చిక్కుల తలచి
తల్లితన కొఱకు తపియించుటగని
సల్లనయ్యెయునవ్వెనర్మగర్భముగ
బాలుడై చిలిపిగ భగవానుడుతన
లీలల జూపును లీలావినోది
వర్ష వర్షమువ్రజవాసులు విడక
వర్షమ్ము గోరుచు వజ్రిని గొలుచు
నందాదులింద్రుని నమ్మిపూజించ
ఎందుకనుచుకృష్ణుడెదురు వాదించె
వారికి నదులను వసుధను, గిరుల
చేరిపూజించగ జెప్పిచేయించె
వరుణుడింద్రుని యాజ్ఞ వర్షించెమిగుల
హరిగాచెప్రజలను అచలమ్మునెత్తి
గోవర్ధనగిరిని గోపాలుడెత్త
గోవులు గోపాలకులు కూడిరచట
పూలగుత్తిని కేళిపూర్వకమ్ముగను
తేలనెత్తు విధముగిరినెత్తె హరియు
పన్నగ శాయి యాపన్నులగావ
అన్నగధారియై యండగ నిలిచె
చిటికెన వ్రేలుపై చిటికలో దాల్చి
వటవృక్షమై నీడ వారికిచ్చె హరి
గోపాలుడాకొండ గొడుగుగపట్టి
కాపాడె గోగోపగణము నెల్లరను

భూమిని ధరియించు పురుషోత్తమునకు
ఏమిభారమగును? ఈ పర్వతమ్ము
ఈ సునరగిలెడి యింద్రుడికన్న
ఏశిలయైనను యెక్కువె అనియె
నమ్మికొలిచిన చో నగమైనగాచు
మిమ్ముల నంచని మెల్లగ జూపె
కొండంత భారమ్ము కోరి గైకొందు
నిండుగ నన్నమ్మ నిరతమ్మునినియె
ప్రత్యక్ష దైవమై పలుక కృష్ణుండు
సత్యమ్ము నెరిగిరి సర్వజనులును
కష్టకాలమ్మున కరుణను కాచి
ఇష్టుల కెప్పుడు హితముగూర్చు హరి
ప్రత్యక్షముగవారు పరమాత్మగూడి
నిత్యము ముదమున నివసించుచుండ్రి
మహినెల్లరకుతన మహిమలు జూపి
సహకరించుచునుండు సన్మార్గులకును
వేడుక నూదుచు వేణువునెపుడు
వాడుక నల్లరివదలక జేయు
సహవాసు లెల్లరు సంతసించంగ
ఇహపర సుఖములనిచ్చును శౌరి
తపమెంత జేసిన తరియించలేరు
ఉపచారములు చేసిఒప్పించలేరు
కాని యాశ్రీహరి కరుణించెనేని
కాన లేని ఘనత కానంగ గలరు

# గోపికలు - కాత్యాయినీ వ్రతము



రామావతా రమ్ము రమణీయభక్తి
ఆమునులైతిరి ఆగోపికలుగ
వలపున గోపికావనిత లెల్లరును
అలరింత్రు కృష్ణుని ఆరాధనమున
తనుమన ధనములతామెల్లరునిడి
అనవరతము వారు హరిని సేవింత్రు
విరహమ్ము వివరించు విరిబోణుల హరి
సరసమ్ము సవరించు సమభావనలను
బలమున్న బలినితా బలిమియాచించి
వలపున్నయబలల వలపునుదోచు
మాయజాలమ్మునమనసులు గెలిచి
ఆయమాయికులను ఆడించును హరి
సురరక్షకుని మ్రొక్కి సుదతులదరును
మొరలిడు చుందురు మోహమ్ము మీర
కొంతతడవుగూడ గోపవనితలు
వింతగ కృష్ణుని వీడకయుంద్రు
ఒకపరికనకున్న ఒక్కొక్కతెయును
సకలము కోల్పోవుచందమ్ము వగుచు
తరులను, గిరులను, తపనను వెదకు
పరుగిడు మెకములపట్టి అర్థించు
పొదరిళ్లను వెదకు పొరుగిళ్ల నడుగు
వదలక నలుదెసల్ వనమంత చూడు
జాడనుకనుగొనజాలకరోసి

కూడును కుడువక కుందుచునుంద్రు
గోపికాలోలుండు గోపాలకుండు
ఆపదల్ బాపెడు ఆర్తరక్షకుడు
నావను, భావము నాకులేదనిన
నావను, జీవన నావను నడుపు
యమునను నౌకా విహారము సలుపు
సమయానికి తగిన సరసోక్తులాడు
మురళీ రవమ్ము ముద్దుగుమ్మలను
మురిపించు, మృదుహాసమునుగురిపించు
వలయాకృతిని జేరివ్రజ వనితలును
ఎలుగెత్తి పాడుదు రెదనిండుభక్తి
మేలిమిబంగరుమేని ఛాయలను
సోలుచునుందురు సొగసుగత్తియలు
నారినారి నడుమ నాహరి పసిడి
హారమ్ము నీలాలు అతికినట్లమరు
రమణుల మధ్య శ్రీరమణుడు జేరి
రమణీయత మురళీ రవళిని యొప్పు
పులకింతనొందుచు పూబోణులందురు
తలక్రిందులగుదురు తన్మయత్వమున
వేణునాదమ్మున వివశులై వారు
వేణువినోదుని వినుతించుచుంద్రు
వేడుకొనును వినవేడుక గొనును



నాడు, నేడును వేణు నాదమ్ముజనులు
వేణుగా నలహరివేల్పులుదేలు
వేణువు హరి లీల విలసిల్లు హేల
జగతిని స్థావర జంగమములును
ఖగములు, మృగములు కలకలలాడు
మురళీరవళికినిమురియు తరువులు
విరహమ్ము గోపికల్ వెతనొందు చుంద్రు
శీతమయూఖుడు శ్రీఘ్రమేతెంచ
శీతలపవనముల్ సేదను తీర్చు
వెన్నెల వెలుగులు విరజిమ్ముచుండ
వెన్నుడు విహరించు వెలదులగూడి
గళముతులసిమాలగంధమ్ము భ్రమర
గళముల భ్రమర ఝుంకారములలరు
రమణుల గూడి అద్భుత రీతి
రాసక్రీడల హరియొప్పుచుండు
అమలినశృంగారమాధ్యాత్మచింత
అమరిన దృశ్యము ఆనందప్రదము
కమనీయ రూపమ్ము కలగనుచునట
తమకు దర్శనమీయ తరుణులర్థింత్రు
సతతము కృష్ణుని సన్నిధిగోరి
సతమతమగునతి సన్మతుల్ వారు
కామిత మీడేర్చు కాత్యాయినియని
ఆమూవ్రతము జేయదలచె గోపికలు
కలియుగతియు కృష్ణపరమాత్మయెయని

అతిభక్తి గొలిచిరి అంబనువారు
గోపికలందరు కోరికతీర
ఓపికగనువ్రత మొనరించిరపుడు
దివ్వెలు వెలిగించి దేవినర్చించి
ముప్పగోపాలుని ముడివేయమనిరి
నియమమ్ము కాత్యాయినీవ్రతమందు
నియమించె వారిని నిష్ఠాతులుగను
కాత్యాయినీదేవికరుణించియంత
ఆత్యాగమూర్తుల నాశీర్వదించె
పూర్వజన్మల వారి పుణ్యఫలమ్ము
పార్వతికన్నుల ప్రసరించెకరణ
ఆశతీర్చియు వారి నాదరమొప్ప
లేశమైనను జూగు లేకుండ జూచె
విభవమ్మునను వారు వెలిగి పోవంగ
అభయమ్మునిచ్చెను హరివారలకును
తపియించిగోపికల్ తమనేలు హరిని
జపియించియమునలో జలకమాడేరు
భామలందరు గూడి పరిహాసములను
తామొకరినొకరు తలవంచిముంచు
కేరింత లాడుచు క్రిందుమీదగుచు
నీరంతచిమ్ముచూ నీదుచునుండె
చల్లని సలిలమ్ము చక్కగ మునిగి
ఉల్లాసముగవారు ఊసులుచెప్పు
ముదితలు ముచ్చట్లమునుగంగజూచి

అదియెసందని యేగెఅనిరుద్ధుడపుడు
వనితలు వలువలు వలిచియుంచుటను
కనెనంతకృష్ణుడు కౌతుకంబునను
అల్లరి కృష్ణుడు ఆటపట్టించ
చల్లగ జేరెను చక్కగనచట
చెట్టు చాటున జేరిచిన్నకృష్ణుండు
గుట్టుగ చీరలు కొంటెగ తెచ్చె
ఏమార్చి వారిని ఏడిపించంగ
ఆమాయ నాటకమ్మాడెకృష్ణుండు
కొమ్మల చాటున కొమ్మలగనుచు
కొమ్మలవలువలు గొమ్మనినుడివె
వారిచీరలు దోచివాసుదేవుండు
కోరిచెప్పెను నీతిగొప్పవేదాంతి
అరయగ చీరలు అపహరించుటను
పరమార్ధమెరిగించెపరమాత్మయతడు
కోకలు హరియించి గోపికలనట
సాకారముంజేసి సంస్కరించెహరి
తమయున్కి లేదనిదైవమ్మెదిక్కు
తమకంచు తలచుటె తగునని తెలిపె
చేడియలందరు చేలములడుగ
వేడుకగను జూచెవేణువూదుచును
భీతహరి ణిలు గోపికల నా చక్రి
మూతిబిగించుచు మురిపించె నపుడు
ఎరుగము నన్యుల? ఎరుకయెనీకు

శరణు కృష్ణ గురుడున్ సఖుడునీవంచు
కరములు జోడించి కరము దీనతను
స్థిరముగ వేడిరి శిరములు వంచి
నీవెదిక్కని నమ్మినిశ్చల భక్తి
సేవించ తృప్తినిచెందెను హరియు
వారిభక్తికి మెచ్చి వారిజాక్షుండు
వారి కోకల నిచ్చెవారించ కుండ
కృష్ణుని ప్రేమను కృపను పొందగను
తృష్ణను వీడినతృప్తి లభించు
జీవాత్మపరమాత్మ జేరుటయనగ
ఆవాసుదేవునియం దైక్యమగుటె
మరులు గొన్నట్టి యామగువలందరును
సరస సంభాషణల్ సాగించిరపుడు
కనుసన్నల మెలగుచు కంజాక్షులెపుడు
మనసున ప్రార్థింత్రు మదనగోపాలు
పులకిత గాత్రులైపుణ్యపురుషుని
గలగల కీర్తంత్రుగాన లహరిని
మేనిచాయను జూడ మేఘమ్ముఛాయ
ఆనయనమ్ములు ఆకర్ణములవి
వదనమ్ము చిరునవ్వు వరముల జల్లు
ఎదపుష్పకవిమానమెయనంగనొప్పు
పుంభావమునలరు పురుషోత్తముండు
సంభాషణమ్మున సమ్మోహనుండు
వయ్యారి భామల వలపుగుర్తించి



సయ్యాట లాడుచు సందిట నుంచు
లాలసలలనలు లాలనదేలు
లీలలీలలజూపువెన్నుడుచాల
పరమది తమకని వదలక యుండి
హరినికీర్తింతురహర్నిశలుగను
గోపికా గీతలు కొసరికొసరియు
గోపాలుడువినగ గొంతెత్తిపాడు
నారీ మణుల మధ్యనలరుమురారి
వారును వీడరువనమాలి నెపుడు
వారులువేరైనదామోదరుగన
వారులుకాలేరు దురితదూరునకు
అందరిలోనిండి అంతరంగముల
సుందరమ్ముగ తాను శోభిల్లుశౌరి
ప్రత్యక్షముగ నుండు పంచభూతముల
నిత్యముదైవము నెలకొని యుండు
మదినమ్మి మనసారమాధవసేవ
ముదితలు చేసిరి ముచ్చటదీర
అతివలు కృష్ణుని హాసమ్ముగోరి
అతిశీఘ్రగతివత్తు రత్యంతప్రీతి
నాదస్వరము విన్ననాగుల వోలె
నాదమ్మువిందురు మురళీస్వనమును
వేడుక గొలిపెడువేణునాదమును
వేడుక చెలియలు వినుచుందురెపుడు
ఆరురంధ్రమ్ముల ఆవేణు వూది

ఆరోహణమ్మును అవరోహణమ్ము
సప్తస్వరములను సంగతుల్ వేసి
లిప్తలో భక్తుల లీనమ్ము జేయు
వివిధ మూర్చనల నావేణ నాదమున
యువిదలు మూర్ఛను ఒరుగుచునుంద్రు
సకలభువనములు సమ్మోహనముగ
ప్రకటించు భక్తిని పారవశ్యమును
నందకిషోరుడు నవనీత చోరు
బృందమ్మువిహరించు బృందావనమ్ము
రాసక్రీడల దేల్చురమణీ మణులను
బాసలు చేసియుబాగుగ తీర్చు
హరిచెంత లేకున్న అలుకసాగించి
విరిబోణులందరు విరహమ్ముచెంద
తానొక్కడేయైన తలకొక్కడుగను
మానినులు తలచ మనసులుదోచు
ఆరాధ్యదైవము ఆరాధకతడు
ఆరాధమాధవు ననురాగమూర్తి
ఆదర్శప్రాయముఆప్రణయమ్ము
ఆదిదేవునిలీల ఆనందప్రదము
మురళీ ధరు ప్రియమురళిని గాన
తరియింతును హరికథాగానసరళి
వరియింతునాకరివరదుని కరము
స్మరియింతును హరిని సర్వకాలముల
ఈసునసూయలు యెరుగనినన్ను

ఆసుమనోహరుడాశీర్వదించు
ఒడలు మనసుడొల్లనొప్పుదుగాన
విడువక కృష్ణుని వేణువు నైతి
మురళీరవమునను మురిపెమ్ము మీర
మురహరి మీటును మునివ్రేళ్ళు నన్ను
చరణముల నునమ్మి చక్రికరముల
తరుశాఖచెంది యుతరియించు చుంటి
అధరామృతమ్మున అవినాశయగుచు
మధురగానమ్మునమైరపింతు
వెదురుగ జన్మించి వేణువై హరికి
ఎదలదో చుచునుందు ఎదురులేకుండ
సర్వత్ర వసియించుసర్వేశ్వరుండు
సర్వుల సమదృష్టిసవరించుచుండు
జన్మలందునరజన్మముత్తమము
జన్మసార్ధక మౌనుజ్ఞానమ్ము కలుగ
మానవులకుమంచి మార్గమ్ము కలదు
కానగ వచ్చును కైవల్య సిద్ధి
హరి నామమెప్పుడు అనవలెనోట
కరచరణమ్ముల గావించుసేవ

హరిరూపమునెగను ఆకన్నుదోయి
హరిగూర్చియెవినుము ఆకర్ణములను
హరిపూజ గంధమ్ము ఆఘ్రాణమెసగి
విరివిగ నాసిక విరితావినొంద
తనువున సాష్టాంగ దండమొనర్చు
మనసునస్మరియించుమాధవు నెపుడు
సర్వేంద్రియమ్ముల సకలమ్ముమరచి
సర్వేశుపూజింప సంతృప్తికలుగు
హరిభక్తి మయమును అలవర్చు కొనిన
మరియుండ దేరికి మహిలోనలోటు
స్వానుభవమ్మున చాటుసందేశ
మౌను భక్తియెమార్గ మగుజనులకును
సర్వత:వ్యాపించి సర్వేశ్వరుండు
సర్వాత్మకంబునై సహజమ్మునుండు
హరి పదసేవను ఆత్మశుద్ధిగను
మరిజేసిమనవలె మానవులెల్ల
వేణువు నాపేరు వేలరాగముల
వేణుగోపాలుని వివరింతునెపుడు





# హరి పరీక్ష

యందు ననురక్తితనపైన భక్తి
రారు గోపకాంతలకును శౌరి
పాటున నొప్పి ఉదరమ్మునను
పరీక్షను చిలిపిగపెట్టె
వేళపడిరి గోపికలు దరిజేరి
ఒడిగె చిన్ని కన్నయ్యగనుచు
దీనవదనలై కన్నులనీరు
చుచు నార్తిగ విలపించి రపుడు
పంకకు జూచివాసుదేవుండు
వారిని వారించె వగవవలదని
బాధానివారణోపాయమ్ము తెలుపు
మాధవా! యనివేడ మగువలందరును
పాదరజమును మిళితమైనట్టి
పాద జలమును మీరీయవలెను
పాదోదకముద్రావ బాగుగనగుదు
బాధ పోవును వెంటనేయనియె
శంకించక వందనంబిడుచు
శౌరికోరికదీర్చసంసిద్ధులైరి
భీతియనక పరమాత్మనపుడు

పాపము భావించి బాధితునిగనె
బాధచూడగ లేము బాగైనచాలు
మాధవ! మాతను మనములునీవె!
అనుచు పాదోదకంబటులె తెచ్చియును
అనురాగ మొలుకంగ అందించిరపుడు
కోరిరి క్షేమముకొల్లగవారు
కోరిరి ప్రేమనెకోమలులంత
వారినిర్మలమైన వలపును, భక్తి
వారిజాక్షుడు జూపెవసుధనందరకు
సానుకూలమ్ముగ స్పందింపజేసి
తానుపరీక్షించితరియింప జేయు
సానపెట్టినవజ్ర సదృశమ్ముగనిక
తానుమెచ్చినవారి తగునుద్ధరించు
హరియించిపాపము హరిసంస్కరించు
హరిభక్తియే మిన్న ! అన్నింటికన్న
సరసిజనాభుని సంకీర్తనములు
సురలకునరులకు శుభకరమగును
హరిపదసేవకు అంకితమైన
సిరిసంపదలు కీర్తి సిరి మెచ్చియిచ్చు



# శ్రీకృష్ణ లీలామృతము



శ్రీకృష్ణ లీలలుశ్రీశుక యోగి
శ్రీకృష్ణువర్ణించి శ్రీఘ్రమ్ముతెలిపె
ఆపద బాయగ అత్యంత శ్రద్ధ
ఆపరీక్షిత్తును ఆద్యంతము వినె
శ్రీకృష్ణ లీలలు సిరిమెచ్చుకొనగ
ఆకృతి మురళిని ఆలపించెదను
చల్లని చూపులచక్కని వాడు
నల్లని వాడైన నవమన్మథుండు
చిరు చిరు నగవులు చిందించు చిలిపి
సిరిగలవాడు యాశ్రితవత్సలుండు
మోహన వంశి యా మురళీధరుండు
మోహింప జేయును మురళీరవళిని
కామము, క్రోధాధికార మసూయ
ఈమహి ద్వేషము, ఈర్ష్యాదులారు
ఆరురంధ్రములున్న ఆవేణువూది
ఆరుశత్రువులను అరికట్ట మనును
తనుమనములనుంచి తన యధీనమున
మనసార గొలిచిన మన్నించు హరియు
శిరమున నేత్రమైశిఖిపింఛ మొప్పు
అరయుదు నాకంట ఆర్తుల నను
బలరామకృష్ణుల బాల్యమ్ముగడచె
తలచెనేమొ విధియు తరుణమ్మదియని

కలగాంచికంసుడు కబురంపెనపుడు
తలబెట్టి వారికి తక్షణశిక్ష
ఉరుము లేనిపిడుగు ఊరిమిదపడి
ఉరికినదాపద ఊరికనంగ
బలరామకృష్ణుల బలిమి తోడ్కొనగ
పిలువ నక్రూరు బంపెను కంసు, డట
క్రూరుడు కంసు డక్రూరునిబంపె
ఘోరకు టిలతను కృష్ణుని జంప
అరదమ్ము దెచ్చియా అక్రూరు డుండ
విరహమ్ము నసఖులు విలపించిరపుడు
మరునాడె కృష్ణుడుమధుర కేగునని
పరుగున గూడిరి ప్రజలంత నచట
కలకలలాడుచు కలసితిరుగుచు
గలగల కబురుల కాలముగడుపు
సోదరులిద్దరి సొగసునుచూసి
యాదవులందరు అబ్బురపడిరి
వారువీరిని వీరు వారిని వీడ
లేరను వారు కలిసిరి వేదనగ
పొందిక కృష్ణుని పొందును గోరి
అందము డెందమ్ము నందరు మెచ్చు
సుతువీడి మనలేక సుదతియశోద



అతిదు:ఖవివశయై ఆక్రోశమొందె
తనముద్దు తీరక తల్లి యశోద
తనయుని యొడలంత తడుముచునుండె
సఖిని కౌస్తుభమణి సవరించమనుచు
శిఖిపింఛమును చెట్టిశిరముముద్దాడె
తిలకమునుదుటను తీరుగదిద్ది
కలికిముచ్చటపడె కన్నయ్యకళకు
పట్టుబట్టలుకట్టు పట్టినిపట్టి
పట్టి పట్టి గనును పట్టలేకగను
దిష్టితగులకుండ దిష్టితీసియును
పుష్టిగ తినమంచు బుగ్గలు పుణుకు
సిరిచుక్కలను బెట్టి చిరుబుగ్గలందు
మురిపెమ్ముముద్దాడు ముద్దుబాలకుల
మానవుడై యున్న మధుసూదనుండు
ఊసును తిలకించు తల్లిని నగుచు
మనసున నొవ్వక మధురకు పంప
జననీజనకులను చక్రియొప్పించె
ఆతల్లి దండ్రులు అతిగదు:ఖించ
నీతులు జోడించ చెలికాండ్రుకుమిలి
చల్లని చూపుల ఝల్లన జూసి
ఎల్లర నోదార్చి ఎడబాసె హరియు
బలరామకృష్ణులు బయలు దేరగను
కలవరమ్ముగనిరి కనుచూపుమేర
అల్లరి తనమును అచ్చటె విడిచి

మెల్లగ వీడిరి మిత్ర బృందమును
బంధుమిత్రులు తల్లి పరితపించంగ
బంధము త్రెంచుకు బయలుదేరిరిక
చక్రాయుధుండగ్ర జుసహితముగను
అక్రూరవరదుడై అనుసరించెనిక
భారముగ బ్రతకు భావించి తల్లి
దూరమైసుతునకు దురపిల్లసాగె
కడలియై కానయై కడుపునపొంగె
బడబాగ్ని, దావాగ్ని పాపమాతల్లి
నందను నెడబాసి నందుడుకుంది
డెందము నందెవేడె హరినా తండ్రి
మాతాపితరులమమత బిడ్డలకును
ఏతావునందైన నిచ్చు క్షేమమ్ము
మధురకు జేరినమధురక్షణంచె
విధిపరిశోధించె విధివిధాతనట
అల్లనల్లన వారు అటజేరినంత
మల్లయుద్ధమునకు మల్లుడు పిలిచె
కజ్జమాడగవచ్చి కాలుదువ్వంగ
ముజ్జగములు మెచ్చముందుకునురికె
వారికిసాటి యెవ్వరు లేరనంగ
మారాడకుండగ మల్లునిదునిమె
సాధకులకెయది సాధ్యముసుమ్మ
యోధులేవీరంచు యోచించ జనులు
అల్లుడు మల్లుని హతమార్చగవిని

కొల్లగనుల్లమ్ము ఘొల్లనెమామ
మేనల్లు నిఘనతకు మేనుకంపించె
మానవుడనినమ్మె మాధవునతడు
బలిమిని బలిచేయ బలువురపిలిచి
పలుమార్లు యత్నించి భంగపడియెను
మావటిచేతను మత్తే భమంప
సావధానమ్ముగ జంపెకృష్ణుండు
కువలయ మనెడు యాకుంజర వధను
కువలయాపీడ పోగొట్టెను శౌరి
గిరిధారికిది యొక క్రీడయెకాద?
కరిజంప ఘనమౌన? కడుచిత్రమౌన?
కిటియైపుడమి నెత్తి కీర్తి గొన్నహరి
చిటికెలో దనుజలచితక గొట్టుహరి
తనపైదుముకుచున్న తరుణమ్ము కరిని
కనివినిఎరుగని కరణినిజంపె
ఎన్ని వింతలు గన్న ఎన్ని విన్న
చిన్నికృష్ణుని జంపు చింతవీడకనె
కంసుడు కృష్ణుని కడతేర్చుటకును
సంసిద్ధుడయ్యెను సంశయించకను
వారిని వధియించ వరుసగబూని
కోరివరించెను ఘోరమృత్యువును
బలరామకృష్ణుల బలమును, యుక్తి
కలహించ కంసుండు గమనించె నపుడు
చడుగుడు నాడెడు చందమ్ము చక్రి

దడదలాడించె తడబడకుండ
వినువీధి విహరించు వినతాసుతుండు
కనబడు పామును కడతేర్చునటుల
కరముల బంధించి కంఠమ్ము పట్టి
సురలు మెచ్చగను కంసుని జంపెశౌరి
కంసునిహింసలు గతియించజనులు
వంశికృష్ణు నుతించివారుఘనముగ
సింహరాజు గజమున్ చెండాడినటుల
సంహరించె హరికంసాధిపుననిరి
కాలనేమినిజంపి ఘనతను పొంది
చాలించి లీలలు జననిని జేరె
అన్నదమ్ములు జేరి రాత్రమ్ముగాను
కన్నవారిని జూడ కారాగృహమ్ము
వారికి యొడి జేరి వందనములిడి
వారిదీవెనలంది వరుసనో దార్చె
వ్యధ బాసిముదమందె వారిరూపమ్ము
సుధలొల్కుపలుకులు చూసియు, వినియ
చెరవిడిపించుచుయుక్షేమమరయగ
మురిపెమ్ము వారంత ముచ్చటపడిరి
తమ తాత తండ్రుల దరిజేరివారు
మమతను పంచిరి మదిపొంగునటుల
కలసివచ్చెను కాలగమనమ్మనంగ
కలసిరి నడచివచ్చి కన్న బిడ్డలును
ఉత్తమ గుణనిధి ఉగ్రసేనునకు



చిత్తముదోచిరి చిన్ని మనుమలు
పట్టము న్యాయము చక్క బెట్టుటకు
పట్టము గట్టగ పట్టుబట్టుచును
మాతామహుని జేసె మధురకు ప్రభువు
తాతామనుమలకు ధర ప్రణమిల్లె
ఖ్యాతి గాంచునటులకలలు పండించి
ప్రీతిని గొలుపగ ప్రియసుతులపుడు
తనయుల జూచుచు తల్లిదండ్రులును
మనలేము మిమువీడి మరియుండమనిరి
దినములుగడిచెను దివ్యమ్ముగాను
తనయుల విద్యకు తరుణమ్మువచ్చె
విదుపకవిద్యను విధిగనేర్వంగ
విడలేకవిడలేక వీడిరి వారి
ముద్దుబిడ్డల బాసి మురిపెమ్ముబాసి
విద్దియకోరుచువిజ్ఞతబంపె
గురుకుల వాసము కోరిబిడ్డలను
గురుతర బాధ్యతన్ గొప్పగజేసె
వాడిన మోముల వారిని సుతులు
వీడిరి వలదంచు వేదన పడగ
జననీజనకులను శలవుగైకొనియు
తనయులు శ్రీఘ్రమెతరిలిరికాశి
కారణజన్ములు కాశీకిజనియు

సారమ్ము నేర్చిరి సర్వమ్ము నెరిగి
సకలశాస్త్రమ్ములు సాందీపనికడ
చకచక నేర్చిరి చక్కగవారు
గురువున కుండెను కొమరుడొక్కండు
గురుసుతునాయుస్సుకొరవడియుండె
గురుదేవుకుశలము గోరిగురుతుగ
గురుసుతు నాయుస్సుగురుదక్షిణనిడె
శివునివేడుట నేర్పచిన్నవానికిని
శివభక్తి నతడును శివుని మెప్పించె
నీలకంఠుడు నిచ్చెనిండుజీవితము
బాలునకు వరమై భాసిల్లునటుల
అతడె మార్కండేయుడను చిరంజీవి
సతతము శంభునిస్మరియించుచుండు
మాతా పితరు భక్తి మరిగురు భక్తి
చేతల జూపిరి స్థితప్రజ్ఞులగుట
ఆరామకృష్ణుల నాదర్శముగను
ఆరాధనమ్మున ఆచరించనగు
నెఅనమ్ముసఖులన్ననెయ్యమ్మునుంద్రు
కఅకురక్కసులన్న కయ్యమ్మునుంద్రు
వేణువు నా పేరు వేలరాగాలు
వేణు మాధవు గూర్చి వేనోళ్ళచెపుదు



# రుక్మిణీ కళ్యాణము



బాలకృష్ణునిలీల బాగు బాగనిరి
మేలగుకల్యాణ మేరీతి జరిగె?
ఆకర్షణీయమ్ముహరివివాహమ్ము
ఆకథనడిగెను ఆపరీక్షత్తు
సకల శుభకరమౌశౌరి సంగతులు
శుకముని నుడివెను శుభగాత్రమలర
లోకకల్యాణమె లోకేశుపెండ్లి
శోకనివారిణి శ్రోతవ్యమగును
వేణుగానమ్మున వినిపింతు ముదము
వేణులోలుని పెండ్లి వింతలు గనుము
బలరామకృష్ణుల ప్రతిభనుగాంచి
వలచిరికన్యలు వరుసగనిలిచి
తలచినయంతనె తల్లిదండ్రులును
బలరాము రేవతి పరిణయమ్మాయె
ఈడుజోడుగ నుండె ఇంపైన జంట
తోడు నీడగ నుండి తృప్తికల్గించు
ఒకరికి నొకరుగ నొప్పెగొప్పగను
ఒకమాట ఒక బాట నొద్దిక నుండు
అనసాగిరందరు ఆదంపతులను
కనసాగిరందరు కనుల పంటగను
అనుకూలవతిగోరి ఆకృష్ణునకును
ఘనముగతలచిరి కన్నవారపుడు
విరివిగ వధువుల వెదుకగ వారు

హరిగోరి వచ్చిరి అధిక సంఖ్యలను
దేవకి పతివసుదేవు బ్రశ్నించె
ఏవధూమణి వచ్చు ఈ కృష్ణునకని?
తల్లిదండ్రి తలచె తనయుని పెండ్లి
పిల్లనీయగ వచ్చి పెద్దలందరును
పెళ్ళికుమార్తెను పెనువర్ణనమున
పెళ్ళిమాటలనాడె పెళ్ళిపెద్దలును
నల్లనయ్యకు నచ్చు నాజూకుబాల
చల్లనయ్యకు సరిచక్కనిచుక్క
తృణమైన కోరకెతృప్తిగనుండు
అణుకువ నలరారు అలివేణిగనుడు
చిత్తేశుడు విభుని స్థిరభక్తిగొలుచు
అత్తమామలసేవ అధికమ్ముసేయు
తలలోననాలుకై తనరుమా తనయ
ఇలలోన వేరొక ఇంతిలేదండి
పతిపదసేవయెపరమభాగ్యమని
సతికిసౌభాగ్యము సతిధర్మమునును
కనుసన్న మెలగును కన్నవారనక
తనుమెట్టి నింటనె తనరారు తరుణి
ఎవరికి వారంత నీరీతి దెలుప
చివరికి జరుపును చిత్రమ్మును విధి
ఏవిధ మెంచిన ఏమియుకాదు



అవిరించియెగూర్చు ఆలుమగలను
కమలాసనుడు జంటకలిపెడు విధము
కమలాప్తుడైనను కనుగొనలేడు
మహినేలు కృష్ణునే మనసారగోరె
మహారాజు భీష్మకాత్మజరుక్మిణియును
అన్నపానాదుల నామెవర్జించి
కన్నయ్య రూపమ్మె కనుల నింపుకొనె
అనవరతము చక్రి ఆరాధనమున
కనసాగె కమ్మని కలల నా కలికి
మురళీధరునినమ్మి ముద్దరాలుండ
స్థిరపరచివరుడు శిశుపాలు డనుచు
అన్నరుక్మియు తండ్రి ఆభీష్మకుండు
మిన్నగ శిశుపాలు మెచ్చుచుండంగ
ఆరామరుక్మిణి ఆరాట పడుచు
ఓరాయబారిగ ఒకవిప్రునంపె
వానినటుల బంపి వారి జాక్షియును
వానిరాకకు వేచెవనమాలి దలచి
విప్రుడా హరిజూడవెడలెనొలేదా?
విప్రుడు నామొర వినిపించలేదా?
విన్నను కృష్ణుడు విరమించు కొనెనొ
నన్నాదరించునా? నానోముఫలము?
నన్ను చుల్కనజేసి నారాయణుండు
మిన్నకుండున లేక మెచ్చుకోగలడ?
వరియింతు నా కరివరదునికరము
స్మరియింతును హరిని సర్వకాలముల

వేచియున్నవనిత వినతిని వినడ?
నాచేయి బట్టున? నళినాక్షుడిపుడు
విభునిగ ఆలోకవిభునితలచుచు
అభయహస్తము కోరి ఆకన్యయుండె
పరిపరివిధముల పరితపించుచును
హరితలపుల నుండె ఆభీష్మదుహిత
మదిచింత నొందుచుమారాడ కుండ
ఎదురు తెన్నులు జూచుచెదనమ్మియుండె
తగినవాడని తాను తలచెరుక్మిణియు
భగవంతు నర్చించు భక్తురాలి వలె
కమలబాంధవు గోరు కమలమ్ము భంగి
కమలనాభువలచె కమలలో చనయు
స్వాతివానకు జూడుసరిముత్యమట్లు
ప్రీతిగ వేచెను ప్రియునిదర్శింప
పులకించి చెప్పెను భూసురుండపుడు
వలపుఫలించె వనితకం చనుచు
పురుషోత్తమునిరాక పూబోడియెరిగి
అరిగెను పూజించ ఆలయమ్మునకు
గజతురగభటసంఘమనుసరింప
గజగమనవెడలె ఘనముగ గుడికి
ఇందుధరునిసతి ఇలవేల్పుపూజ
ఇందువదన జేసెఇంటి వాడుకగ
ఆనవ వధువు తానర్చించియపుడు
ఆనవాయితితీర్చె ఆలయమ్మునను
రుక్మిణి చెలులందరు పరివారమును

రుక్మియు, శిశుపాలురును చేరిరటకు
నారీమణి కొఱకు నారాయణుండు
చేరెను కరుణించి శ్రీఘ్రమాలయము
నగజాత నర్చించినవవధూమణియు
ఖగవాహనుని గాంచె కనులపండుగగ
అంబుదవర్ణుండు అంబుజాక్షుండు
కంబుకంఠుడుకనకమయభూషణుడు
స్వర్ణమణికిరీటసంశోభితుండు
కర్ణాభరణ శుభ గాత్రుండుశౌరి
శిరసునలంకార శిఖిపింఛమునను
కరమున మురళిని కనుగొనెరమణి
నగుమోము నరుదెంచు నారాయణుగని
మిగుల సంతస మందె మీననయనయు
కామితార్థప్రదాయకాగ్ర గణ్యుండు
ఆమాధవునిమది అభివాదమునిడె
ఆలయ ద్వారమ్ము హరియవలీల
లాలసనందెను లలన కరమును
పల్లవపాణిసు పాణిగ్రహించి
అల్లన నతివతో అరదమ్ము నెక్కె
శిశుపాలు డారుక్మి శ్రీకృష్ణునపుడు
అసిధారనెదిరించి అడ్డమ్మువచ్చె
శూరుడా చక్రిని సుదతిరుక్మిణియు
వారిని వధియించవలదంచు కోరె
ఆర్తిగలలితాంగి అర్థించినంత
పూర్తిగక్షమియించె పుణ్యమూర్తియును

ఆలక్ష్మి అవతార మారుక్మిణియగు
శ్రీలక్ష్మి పతియౌను శ్రీకృష్ణుడనగ
పరిణయ మాకృష్ణ పరమాత్ముడగుట
హరిలీలగ నెరిగి హర్షించిరంత
నందన దనునంది నందునపొందె
డెందమానందమ్ము డిందెను దిగులు
నారికోరిక దీరినరహరింజేరె
వీరతనలరించె విష్ణుమూర్తియును
ఆరుక్మిణికృష్ణులంబర వీధి
తారాశ శాంకుల తరణి భాసిల్ల
కన్నుల పంటగ కన్నట్టి జనులు
మిన్నగ పొందిరి మితి లేనిముదము
లోకానశరణమ్ములోకేశుడొకడె
లోకకల్యాణమ్మెలోకేశుపెండ్లి
సురముని గణమును చూడవేడుకగ
కురిసెను విరివాన కువలయ్యమ్మంత
ఈకథ విన్నను నెలమిచదివిన
లోకులెల్లరకునే లోటులేకుండు
చక్కగ ముని చెప్పెచక్రిలీలలను
మిక్కిలి మక్కువ మెచ్చెను తేడు
మానవజన్మకు మాధవుస్మరణ
కానని చీకటి కరిగించు దివ్వె
వేణుగోపాలుడు విశ్వవిభుండు
వేణువై సేవింతువిరివిగ పాడి
వేణునాదమునకు వివశయైగోవు



బాటీకి వర్షించె, పాల ధారలను
ఓరగవాయువు ఒడుపుగ వీచె
క్షీరము జేరెను కృష్ణుని శిరము
అతివ సుశీలగ ఆవుజన్మించి
అతిశీఘ్రగతి బొందె ఆపుణ్యఫలము
వెన్నుని గాథలు వీనులవిందు
విన్నను కలుగును వెలలేని శుభము
హరి కథాసుధగ్రోలి అమరులైనటుల
చిరకాలకీర్తిని జీవులు పొందు
నారాయణుని నవ్వునవవసంతమ్ము
నారసింహుని కిన్క నాగ్రీష్మ ఋతువు
శరముల జల్లలౌ వర్షఋతువును

హరిచూపువెన్నెలాశర దృతువునగు
అరయహేమంతము హరియెనిక్కముగ
అరికోటి వణికించు హరియెహేమంత
తరులు జీవులురాల తగుశిశిరమ్ము
హరియె ఋతువులారు హరియెవిశ్వమ్ము
హరియె సర్వస్వము హరియెశరణము
ఏభావమెందైన ఎవ్వరికైన
ఆభగవానుడే ఆవిష్కరించు
వేణువై నేనుందువెన్నుని చెంత
వేణుగోపాలుని వినుతించుచుందు
వేణుమాధవుడును వేలరాగములు
వేణువు నాచేత వినిపించుచుందు



# సత్యభామాపరిణయం



సత్రాజితను రాజుసౌరభక్తుండు
చిత్రమ్మునాదిత్యుసేవించుచుండు
చిత్తశుద్ధిని తేడు చేయుపూజలకు
చిత్తమ్ము మెచ్చెను శ్రీప్రభమాయినుడు
స్మరియించి సూర్యుని సత్రాజితిలను
తరియించెభానునిదయను తాబొంది
తనభక్తుడైన సత్రాజితునకును
దినకరుండిచ్చెను దివ్యమోమణిని
వసుధ ననుదినము వరముగ మణియు
పసిడిని యెనిమిది బారువులిచ్చు
మరి రాజునకు రత్నమహిమచే నంత
సిరివేడుకగ నింట చిందులువేసె
అపురూపమణి నపుడత్యంత శ్రద్ధ
నృపుడును పూజించెనుత్తమరీతి
అశ్యమంతకమణి అధ్భుతమ్ముగని
ఆశ్యామలాంగుడు ఆమణింగోరె
ఇతరుల కిచ్చుట హితముకాదనుచు
చతురతనుడివెను సత్రాజితపుడు
ధరియింతుమణినంచుతమ్ముడర్ధించ
వెరువక నిచ్చెను వితరణ తోడ
సోదరునకొసగి సూర్యని మణిని
సాదరమ్ముగ బంపెసంశయించకను
వేటకై విపినమ్ము వెడలునత్తరిని

బాటలో మృగరాజు భక్షించెనతని
అనతికాలమునందె అనుజుని గూర్చి
వినవచ్చెవనమందువిగత జీవగుట
మరణించెతమ్ముడు మణి పోయెనెటకొ
అరయగ లేకను ఆరాజుకుందె
సత్యమెరుగని రాజు సందేహమొంది
అత్యధికమ్ముగ ఆరాటపడియె
ఆదిత్యుడిచ్చిన అపురూప మణిని
ఆదిని కృష్ణుడు అడిగిన గురుతు
తలచెను కృష్ణుడెతస్కరించెనని
పిలిచియడిగె నంత బిడియమ్ములేక
ఓయదు భూషణ! ఒక్కింతచెపుమ
మాయచేసితివయ్య! మణినిగొంపోయి
పరుల సొత్తును గోర పాడికాదయ్య
మరియాదగను తెచ్చిమణినీయవయ్య
అరయగ నీకున్న అలవాటు కాదె?
దొరలాగ వెన్నను దొంగిలించుటని
నిందమోపెను రాజు నిర్భయమ్ముగను
నిందమోసెను హరినిష్కళంకముగ
నిష్కారణమ్ముగ నీలాపనింద
పుష్కలమ్ముగ పొందెపురుషోత్తముండు
చవితిచంద్రునికన్న చక్రి కీనింద



సపరించ తప్పక సన్నద్ధుడయ్యె
నిందను పొందిన నీలవర్ణుండు
అందందు వెదుకంగ అందెను జాడ
అడవి చేరగనె రాజానుజున్ మెకము
పడవేసి చంపిన పద్ధతి తెలిసె
ఘోరముండగనె సింహమునకుఫల
ఘోరమయ్యెననుచు హరి యెరింగెనట
సకలముతానెయైజగమేలు హరికి
సకలము తెలియుట జరుగద? ఏమి
గురుతులు బట్టుచుగుట్టుగ సాగె
గురుతర బాధ్యత కృష్ణుడు దాల్చి
ఆగల కార్యము ఘనముగ నెరిగి
పోగల్గె ముందుకు పురుషసింహమ్ము
దారిజూపెను గుహదరికిజాడలును
ద్వారము జేరెను దామోదరుండు
రామునిపూజించు రామభక్తుండు
సామర్థ్యమున్నట్టిజాంబవంతుండు
మృగమును జంపియా మణిని గొంపోయి
తగినకానుకయంచు తనయున కొసగె
జాంబవంతుడు కూర్మిసాకును సుతుని
జాంబవతి సుతను జాగరూకతను
కొమరున కూయల గూర్చియాగుహను
సుమతగ శయ్యపై మణినమరించె
పతకమ్ము ప్రేమతో భల్లూకమపుడు

సుతుచేత పెట్టితాజూచెముచ్చటగ
మణిగాంచి యతడిని మాధవుండడుగ
మణినీయ వనచరు మనసొప్పలేదు
హరిని భల్లూకము అరియనియెంచి
హరినిగైకొమ్మనె అనిజేసిగెలిచి
సమరమ్ము సాగించి సాధించిమణిని
రమణీయముగ చక్రిరాముడై నిలచె
తనరాముడెయదునందనుడని తెలిసి
ఎనలేని ముదమున ఎద పొంగెనపుడు
పోరు సలుపగోరెపూర్వజన్మమున
ఆరాముపరమందె ఆభక్తుడిపుడు
సుమమాల వేయించి శుభమనిపలికి
కొమరిత నర్పించె కోరియాతండ్రి
మణినిచ్చికన్య కామణినియొసంగి
గణనచేయగ లేనిఘనతసాధించె
నియమానుసారము నేర్పుగ హరియు
బయలుదేరెను మణిన్ భార్యామణి గొని
గుణమణియైనటి గోవిందుడవుడు
మణినంద జేసెను మానవేశునకు
నీలాపనిందను నేబొందియుంటి
కాలాను గుణముండు కష్టసుఖములు
కష్టసుఖమ్ముల కావడి మోత
స్పష్టము జేయును సర్వముమనకు
సత్యము తెలిసిన సత్రాజితుడును

అత్యంత ప్రియముగ హరినాదరించె
జరిగినదంతయు చక్కగనెరిగి
హరినిక్షమాపణ అర్థించెరాజు
పొరబాటు పడితిని పురుషోత్తముడవు
దొరవంటినిన్నంటి! దొంగవంచకట!
చేసినతప్పులు చెరుపగలేను
దాసరితప్పులు దండమ్మునసరి
మాసత్యకేలంది మమ్ముమన్నించు
వాసుదేవ! యనుచువరము నర్థించె
ఇందువదన సత్య ఇందీవరాక్షు
పొందనామోదమ్ము పూర్తిగ తెలిపె
మౌనముద్రను జూపె మాధవునకును
తాను సమ్మతి నంత తరుణీలలామ
మాటలకందని మధుర భావమును
చాటిచెప్పెను చాల చాన కందోయి
నిత్యముతలచుచు నెఱనమ్మి వలచు
సత్యభామనుగాంచి సమ్మతించెహరి
అంగీకరించంగ ఆకృష్ణునకును
అంగన సత్యను అర్పించెనృపుడు
కొంగులు ముడివడక్రొత్తదంపతులు
పొంగె నంగన సత్య పుణ్యాంతరంగ
తనయను మణియును ధారబోసియును
తనతప్పుదిద్దెను తగురీతి నృపుడు
మణివద్దు కన్యకామణి చాలనిహరి

మణివీడి సత్యభామనుగూడివెడలె
దారలతో హరి ద్వారకజేర
ఊరిలోనను చూడ ఉత్సవమాయె
చేరిరి చెంతకు శీఘ్రమెసఖులు
కోరిరి సతులతో కృష్ణునిజూడ
భళిభళియనగను భద్రలక్షణల
అలమిత్రవిందను, ఆనాగ్నజితిని
కమలనయనయగు కాళిందిని హరి
సమభావమునెంచి సతులనందరిని
పరిణయమాడెనుపరమాత్మడతడు
సరితూగునాయష్టసతులంత గూడి
వారి వారికి తగువరములంబట్టి
వారిజాక్షులనంత వరియించెను హరి
ఈడేరు నీప్సితమీకథ వినగ
ఆడుకొనెదరెప్పుడైశ్వర్యమందు
సరితూగుచుందురు సతులు సమముగ
హరిజూచు వారిని అత్యంతప్రేమ
అందము నందున అనురాగమందు
అందరు సమముగహరినిసేవింత్రు
దెందమలర పతిదేవుని గొలువ
కుందరదనలతి కూరిమి మెలగ
అష్టభార్యల కృష్ణుడాప్యాయ ముగను
కష్టము లేకుండ కాపాడుచుండు
నారదుడు తలచె నారీమణులకు

నారాయణుడె టులున్యాయమ్ముగూర్చు?
పరికించ గనుతాను పరుగున పోయి
కరములుజోడించె కలహభోజనుడు
మరిమరి కృష్ణుని మాయలు తెలియ
హరిలీల లెంచగ ఆమునితరమ?
విష్ణుమాయను జూపి వివరమ్ము తెలిపి
కృష్ణుడు అలరించెకృపతోడమునిని
ఆనారదుండెంతొ హర్షమ్మునొంది
తానుగాంచిన దంత తలబోయువింత
వేఱువై నేనుండి వినిపింతునంత
వేఱుమాధవు వింత వింతలీలలను

పదునారు వేలుగ భార్యలందరిని
పదిలముగను జూచుపరమాత్ముడు హరి
ఆసతులందరి నాప్తముగహరి
ఆసలు దీర్చుచు అలరించుచుండు
ఏనెలతకుకూడ నేలోటులేక
తానొక్కడైనను తలకొకడౌను
కోరిన వెంటనె కోమలి ముందు
కోరిప్రత్యక్షమై కోమలాంగుండు
కొమ్మకొమ్మకు హరి కొంగుబంగారు
ఉమ్మడిగను దీర్చు యువిదల మనసు



# ఇల్లాళ్ళు - ముచ్చట్లు



గృహమేధి గోపాలకృష్ణునింజూడ
తహతహలాడె విధాతసుతుండు
ఇంటింట నేతీరు? ఎటులుండనోపు
కొంటెకృష్ణునరయ గోరెనారదుడు
తనుమాయజేయున? తనభార్యలనని
మనసున కృష్ణుని మమతశంకించె
బ్రహ్మచారియతడు ప్రమదలపట్ల
బ్రహ్మాండముగనుండె భక్తిప్రపత్తి
అందమైన హరితా నర్ధాంగులందు
ముందుగ నెవ్వరి మురిపెమ్ము దీర్చు?
ముర హరి యెవ్వరి ముంగిట నిలచు?
సరసమ్ము నెవ్వరి సందిటనుండు?
నొప్పించకను తాను నొవ్వకుండగను?
తప్పించుకుతిరుగుధన్యుడెట్లగును?
ధర్మసందేహమొందగ నారదుండు
మర్మమెరుగ నెంచి మాధవుంజేరె
జగమేలు పతితన సతులనెల్లపుడు
నగుమోమున గనుచున్నాయమ్ము గూర్చు
ఇంటింటనొక తీరుఇల్లాలి జేరు
వంటయింట తిరుగువనమాలి యొకట
ఒకయింట సతిగూడి ఒద్దికనుండు
ఒకయింటనొక పాట ఒక యింటఆట
ఒకచోట పూజను ఒక చోటకేళి
ఒకచోట చదరంగ మొకచోట బంతి
ఒకయింట తపమందు ఒకట తాపమ్ము
ఒకయింతి జగడమ్ము ఒకయింతిసేవ
సరసమ్ము విరసమ్ము సమపాళములను
సరసిజాక్షుండుండు సఖ్యత సతుల
భుజియించునొకయింట పూర్తిసంతృప్తి
భజియించునొక యింట భామకుతృప్తి
మురళీరవళిని తామురిపెమ్ము దీర్చు
విరుల నయ్యలి వేణి వేణినమర్చు
ఉయ్యాల నూగును ఒక యింటను హరి
వయ్యారి భామతో వలపులోయింట
విడియమ్ము ముచ్చట్లు విరియునోచోట
బిడియంపు కౌగిళ్ళుబిగియునోయింట
పద్మాసనమ్మున భక్తినోచోట
పద్మనాభుడొకట పవళింపుసేవ
ఏకకాలమునందు ఏకైక మూర్తి
పోకడ గనిరిచ్చ బోయెనారదుడు
పురుషోత్తమునిలీల పూర్తికాబోదు
కరువుతీరదు యెన్నికన్నను విన్న
ఆరామలను గూడి ఆరామములను
తీరిక విహరించు తేరులపైన
పూలతోటలయందుపూబోణితనువు



పూలవర్షమ్మున పులకింప జేయు
నెల్తావితెమ్మెర నిలువరించంగ
చిత్తములరగను జేయుకృష్ణుండు
ఒక్కడె నారదు నొక్కసమయమె
ఎక్కడైన గనగ నేమార్చె చక్రి
ఎచ్చోట కాలిడ నేకకాలమున
అచ్చోటకృష్ణుడు ఆతిథ్యమిచ్చె
చల్లగ లీలలు సాగించుహరిని
అల్లనల్లన గాంచె ఆనారదుండు
కదనకుతూహలు గాంచెనోయింట
మదనకుతూహలు మరిగాంచెనొకట
కల్యాణ కారిణికమ్మని మురళి
కల్యాణ రాగముగానమ్ము జేయు
నవనీత చోరుడు నవమన్మథునిగ
నవరాగము లొలుక నటియించుచుండు
యతికలహమునకు యత్నించునంత
మతిపోవ ప్రత్యక్షమవసాగె చక్రి
కోరిగొలువగను కోర్కెల దీర్చి
భూరివరములిచ్చు భువనైక మూర్తి
తారాసహితముగ దర్శనంబిడుచు
నారాయణుడు దీర్చెనారదుశంక
కలనైన తలచని గారడీ కనగ
కలహభోజనునకు కరువయ్యెవిందు
భేదములేకుండ ప్రియురాండ్రనంత
వాదమురాకుండవనమాలి జూచు
హరిదరిమరిజేరి హరియించశంక
హరిగని సురముని హరియెసరియనె
భుజగశయను గాంచి భుజగ భూషణుడు
అజుడు, నింద్రుడమరు లాశ్చర్యపడిరి
నిశ్చల చిత్తుడు నిర్వికారుడని
నిశ్చయించిరివారు నీరజాక్షుడిని
తూరుపునుదయించి త్రుళ్ళుతువచ్చు
సూరీడువలెనుండు సుందరమ్ముగను
రాకేందువదనుండు రాజీవనేత్రు
డాకొంటెగోపాలుడా రాధ్యుడగును
మేలుజలమునుండు మెండురుచియును
గాలిని నేలను గంధమ్ము హరియె
కనులకు కనబడకనె గాచుచక్రి
మనలనని యెరిగి మనవలె మనము
భావించి దిక్కని భగవంతునెపుడు
సేవించ వలయును స్థిరచిత్తశుద్ధి
వెల్లువై పొంగగవేణునాదమ్ము
ఎల్లలు దాటించు ఎదలను ముదము
తలకొకరూపుగతనవిని దీర్చు
కలవోలెభక్తులకాపాడుచుండు
భక్తుల పాలికల్పతరువతండు
శక్తి ప్రసాదించు శరణన్ననమ్మి
విష్ణుమాయనెరుగ వివరించె శుకుడు

కృష్ణలీలాసు ధగ్రోలెను తేడు
మురళీధరుకథలు మోక్షగాములకు
కరతల స్వర్గము కనిపింపజేయు
కృష్ణుని యవతారకృపవిశేషమ్ము
విష్ణుసాయుజ్యము విధిగనందించు
శ్రీపతి యందున చిత్తమునిలుప
పాపము బాయును భయములు తీరు
రయము చీకటిబాపు రవికిరణములు
భయమను చీకటి బాపునుభక్తి
వశమగు స్మరణకు వాసుదేవుండు
కశలము శుభమును గూర్చుచునుండు
భాగవత మ్మది భయహరణమ్ము
కాగలదు భవసాగరతరణమ్ము
హరినామ జపమగు నత్యద్భుతమ్ము
సరిలేదువేరొండు సన్నిధిలేదు
ధృవుడు నారాయణున్ ధృఢముగనమ్మి
ధృవతారయగుట యాదృచ్ఛికమగున?
బాలునకుంఠిత భక్తి దీక్షలను
చాలమెచ్చెను నామజపమును హరియు
సోమమండలమున శోభిల్లెధృవుడు
నామస్మరణను తానలరించిహరిని
హరిభక్తులకు హరి హర్ష మందించు
సరిజేయు నెల్లర సమదృష్టిపరచి
ఉపచార మన్నచో ఊరక నుండు

అపచారమున్నచో హరిసరిదిద్దు
ఒప్పును ఒప్పుచు ఓదార్పునిచ్చు
తప్పున్నశిక్షించు తప్పక శౌరి
హరికటాక్షమ్మున హరియించు నఘము
విరివిగ శుభములు విభవమ్ము కలుగు
వెదురును వింతగ వేణువునైతి
కుదురుగనుందును కృష్ణునకరము
గోవిందు పిల్లన గ్రోవిని నేను
నేవిందు చేయుదునేవీనులందు
పదనిసరాగాలు పలికింతునేను
వెదుకుచునుందును విష్ణుభక్తులను
నమ్మిగొల్చినయంత నారాయణుండు
ఇమ్మహిదీర్చును ఈప్సితమ్ములను
హరికథా వార్నిధి అన్వేషణమున
మరికొన్ని కథలను, మణులు లభించు
నిజమైనభక్తిని నిలకడగొలుచు
నిజభక్తులను చక్రినిజముగ మెచ్చు
భక్తలోలుండైన భగవంతుడిచ్చు
ముక్తిని గూర్చియుముచ్చటించెదము
మానవులైనను మృగములేయైన
తానుమెచ్చును భక్తితత్పరతనిక
హరిభక్తిపరుడగు అంబరీషుండు
హరినినమ్మి గొలుచు అవనీశుడగును
అరుదైన రీతిలో హరినిసేవించు



వరుసనేకాదశ్రీవ్రతమునుజేయు
ఉపవాసదీక్షను ఉర్వీశుడుండు
చపలచిత్తుడు కాక జగదీశు గొలుచు
మౌనిదుర్వాసుడు మౌనులతోడ
తినివిందుకువచ్చెరెచ్చిపోవుచును
సలిలభక్షణమ్ము సమ్మతం బనుచు
పలువురు చెప్పగ బహువిధములుగ
ఉపవాసమునరాజు ఉదకమ్ముగ్రోల
శపియించె మునికిన్క చక్రవర్తి నిక
ఆపదబాపగఅంబరీషుడును
శ్రీపతి ధ్యానము స్థిరముగజేసె
దుర్వాసు డుగ్రుడైదుర్భాషలాడ
గర్వమునణచె చక్రమ్మున హరియు

ఆదర్శమగు భక్తి అంబరీషునిది
ఆదరించెను చక్రి ఆభక్తవరుని
కుటిలులకును చెప్పుగుణపాఠముహరి
కటికసత్యమ్మిది కనుగొని నంత
ఆ సమస్యల బాప ఆలంబనమయి
ఆ సలీలుడుగాచు ఆ సజ్జనులను
ఆదురహంకారయతిని శిక్షించి
సాదరమ్ముగగాచె శౌరి భూపతిని
అంబరీ షునివంటి అతిభక్తిపరుడు
సంబరముగ హరి సన్నిధింగోరు
అడిగిన భక్తులు అడగక యున్న
విడవక వరమిడు విష్ణువు సతము



# గజేంద్రుని గాథ



నగము త్రికూటము నా బరగుచును
జగతినెల్లరచేత సన్నుతిగాంచె
పలురకముల పుష్పఫలవృక్షములును
పలువిహంగమ్ములు పలుమృగములును
సడిజేయు సెలయేర్లు చక్కని నదులు
వడిగసాగుచునుండ వనముశోభిల్లు
గుహనుండి కరిదండుగున్నలు వెడలి
విహరించెవనమున విస్తృతరీతి
నభమును ఘీంకారనాదమ్ములంట
ఇభతతి సందడి ఎంతయొజేసె
కరముల నీరము కరము పూరించె
కరులన్నియేకమై కలసికట్టుగను
మత్తవేదండముల్ మరిమరి త్రాగి
గుత్తగనడచెనుగుహలకు తిరిగి
మదగజమొక్కటి మార్గమ్ముతప్పి
వెదికెను ఉదకము విపినమునందు
విరివిగ దాహమ్ము వేయునత్తరిని
కరి జేరె వనమునగలసరోవరము
కొలనున జలమును గ్రోలగ కరటి
బలముగ మకరముపట్టెగజమును
నీరటమొకపట్టు నీటను లాగి
ఆరాటమునపట్టె నావనాటమును
కరి మకరి కరము కలహించెనపుడు

సరిజోడి యైడస్సెజయమందలేక
చాలకాలము పోరెసరిసమానముగ
చాలకుండె గజము శక్తియునుడిగె
దంతి దీనమ్ముగ ధైర్యమ్ము సడలి
గొంతెత్తి ప్రార్థించె గోవిందునంత
ఆగజేంద్రుని మొరనాలించిశౌరి
వేగమె యేతెంచి వెరపును దీర్చ
రిక్తహస్తములనారీతి నేతెంచె
భక్తుడు ఆర్తిగ ప్రార్ధించినంత
కరిమొరహరివిని కరిగావగమరి
బిరబిరజనెరమన్ పిలిచి చెప్పకనె
మకరిని శిక్షించి మరికరి
మకరికి కరికిని
అసమానభక్తితో హరినిమెప్పించి
మొసలియు హస్తియు మోక్షమునొందె
గతజన్మను మకరిగంధర్వుడగును
గతము నింద్రద్యుమ్ను గజరాజునేడు
పాపము బాయగ పావనులగుచు
శాపవిముక్తిని చయ్యనగనిరి
దంతియుమకరియుదంతము చదువ
సుంతయువిన్నను సుకృతమెయగును
సుంతయు విన్నను సుకృతమ్మెయగును



# భక్త ప్రహ్లాదుడు

మరియొకసమయాన మహినున్నతుడు
పరభక్తుడగువాని వనమాలి బ్రోచె
భక్తాగ్రగణ్యుడు ప్రహ్లాదుడెపుడు
ముక్తిని గోరుచు మురహరిం గొలుచు
ఇహముమరచిహరి హితమనుసుతుడు
అహమునను హరిని, అరియనుతండ్రి
భిన్నభావమ్ములభిన్నముజేసి
ఉన్నత భక్తికి ఉనికిని చూపి
హరిని శత్రువనెడు అసురునకుహరి
హరిభక్తి మహిమకు అర్ధముతెలిపె
జనకుని శిక్షించె జాగుసేయకను
తనయుని రక్షించె దర్శనంబిచ్చి
ఉద్భవించెనుహరి ఉత్తముంగావ
సద్భక్తినెప్పుడు సంతసమ్మొందు
ఉరికికంబమునుండి ఉగ్రరూపమున
నరసింహుడై చీల్చె నఖములనసురు
హరికటాక్షమ్మును ఆతండ్రి, సుతుడు
వరుసగ నొందిరివైరమ్ముభక్తి
అహిరణ్యాక్షుండు అతనిపుత్రుడునా
అహరి కరుణచే అందిరిముక్తి
అనురాగముననైన ఆగ్రహమ్మునను
తననుస్మరించినదయజూపు హరియు
దారులు వేరైనదరిజేరి హరిని
వారును పొందిరి వరుస ఫలితము
నరుడునారాయణునమ్మిసేవించు
గురుడుదైవమ్మని గొల్చునెప్పుడును
కౌరవపాండవకదనరంగమున

పోరుసలుపగీత బోధించెను హరి
వీరతననిజేసి విజయముపొంద
గోరుమనుచు చెప్పె కృష్ణుడునరుని
తమవారిజంపుట తనవల్ల కాదు
సమరమును కిరీటి సాగించ ననియె
పార్ధసారధిచెప్పె పార్ధునకపుడు
సార్ధక గీతార్ధసారమ్మునంత
కర్తకర్మక్రియ కారకు డగుచు
భర్తయై తానంత భరియింతుననియె
మూడుకాలములకు మూలముతానె
చూడగ వలె తన సోద్యములనియె
చేయించునదితానె చేయును తానె
కాయమ్ముకల్పనే కాదుశాశ్వతము
నచ్చచెప్పగఫల్గుణా యనుచుహరి
వచ్చిఅనుర్జను డాజివధియించెరిపుల
పాంచజన్యము బట్టి పార్థసారధిగ
గాంచెవారిని చక్రి ఘనముగుకరుణ
విజయునకు జూపెవిశ్వరూపమ్ము
విజయుడు స్తుతియించి విజయమ్మునందె
శౌరి సఖుల జూడు సౌహార్ధమునను
వైరిని దయజూపు వైవిధ్యముగను
నెయ్యమున కుచేలుని కథ యున్నదిక
కయ్యమునకునరకాసురుడుండె
వినదగునెల్లరు వెన్నునికథలు
కనదగునెల్లరకరుణించు విధము
వేణువునాపేరు వేలరాగముల
వేణుగోపాలుని వినుతింతునెపుడు

# శ్రీకృష్ణ -చెలిమి-కలిమి- బలిమి

శ్రీకృష్ణునకుగల చెలికాండ్రలోన
ఆకుచేలుడు కడు ఆదర్శమగును
గురుకులమందును గూడి రాప్తులుగ
అరసిరివిద్యలు అత్యంత శ్రద్ధ
కలిమిని శోభిల్లు కన్నయ్య కడకు
చెలిమిని చేరె కుచేలు డొకపరి
మనసున మిత్రుండు మరచెనేమొయని
అనుమానమున విప్రు డావల నిలిచె
అదిగమనించిన ఆకృపాజలధి
చదివెనాంతర్యము సంపూర్ణముగను
ఆపాదమస్తక మాప్యాయమొలుక
గోపాలకృష్ణుడు గొంతెత్తిపిలిచి
ఆసనమ్మున చెలునాశీనుజేసి
పూసెను గంధము పూజించెనతిని
కుశలమ్ము కృష్ణుడు కూరిమినడుగ
విశదమాయెను చక్రి విప్రునకపుడు
చెలికుచేలుని యొక్క చింతను బాపి
అలనాటి కృష్ణుడై ఆహ్లాదపరచె
బీదయు గొప్పయు భేదములేదు
సాదరస్నేహము శాశ్వతమగును
స్నేహబంధము బహుచిత్రమ్మునుండు
స్నేహమాధుర్యము స్థిరముగనుండు
మాటలు కలిసినమంచితరుణము
బాటను వేయును బంగరుచెలిమి
మనసులు తెలిసినమరునిమిషమ్ము
కనగలరిద్దరుకమ్మనిచెలిమి

చెలిమియెకలిమిగచిత్తమ్ముదలచ
బలిమియుకలుగును భాగ్యమ్మెయగును
స్నేహసౌరభముండుజీవతాంతమ్ము
స్నేహము ప్రాణము జీవుల కెపుడు
ఇనసుతు, శ్రీరాములింపైనచెలిమి
కనగ కృష్ణకుచేలు ఘనమైత్రియనగ
ఎన్నగ తోచును మిన్నగమనకు
సన్నుతి నొందునుసతతమాచెలిమి
మనకు నాదర్శమా మైత్రియనంగ
అనుసరించ, తగును అనవరతమ్ము
అంతరములు లేని అంతరంగములు
ఎంతయొ చెలిమిని ఏలుచునుండు
చిన్ననాటికబుర్లు చిలిపి చేష్టలును
అన్నియు తలచిరిఆయిరువురును
చదువులు నేర్పినసాందీపనికడ
కుదురుగ నుండట గొప్పగతలచె
అటునిటు పరుగిడు ఆట లన్నియును
అటుకులు బొక్కుట అటవీస్థలములు
విరివిగ మనసులు విప్పిచెప్పుకొన
బరువంతతీరెను బాపనిమదిని
చిన్ననాటి చెలిమి చెదరలేదనుచు
తన్నుతా మరచి తదాత్మ్యమునొందె
తేలికైన మనసంతతెరిపిని పడగ
ఆలుబిడ్డలు నిల్చెఆలోచనలను
అధికసంతానము ఆర్థికబాధ
విధిలేక వచ్చెను వెన్నునర్థించ



సహపాఠి యనవచ్చి సహకారమడుగ
మొహమాటమనిపించి మోముదించుకొనె
విలువైన కానుకవెంట తేలేక
పలువ మూటను దెచ్చెవట్టిఅటుకులు
చెలునకు నిడుటకు చేతులురాక
వెలిదీయ సిగ్గిలి వెతనొందసాగె
కలవరమునతన గళమును విప్పి
పలుకాడశంకించెపాపమాతండు
తనసంతురోదన తనకడగండ్లు
తనసతియర్థింపుతనమదిమెదలె
అంతర్యమెరిగియాహరి అటుకులను
శాంతముగనడిగె సఖునినిమ్మనుచు
మూట విప్పగ సిగ్గు ముంచుకు రాగ
మాటలాడకనిచ్చె మాధవునకును
చెంగున మూటను చెంగున తీసి
బంగారు పడకంచుకన్నయ్య నవ్వె
చెంతకు చేరి కుచేలుని గనుచు
కొంతభేదము లేక సుముఖుడై తినియె
కమ్మనిరుచియంచుకావలెనంచు
ఇమ్మని మరిమరి యిష్టము చూపె
గుప్పెడు అటుకులు కోరిగైకొనియు
విప్పెను చిక్కులు విప్రునకుహరి
తీర్చెనాప్తునకు తీవ్రకష్టములు
కూర్చెమిత్రునకును గుప్తదానమును
ఆశ్రితవత్సలు డాదయామయుడు
ఆశ్రీపతినినమ్మి నంతనెబ్రోచు
శ్రీకృష్ణునికరుణ శ్రీఘ్రమ్మునొంది

శ్రీకృప జేరె కుచేలుడు గృహము
నమ్మకముంచిన నారాయణుండు
ఇమ్మహిజనులకు నిచ్చునువరము
ఫలమైన పుష్పమ్ము పత్రమ్మెయైన
కొలుచుచు నర్పించు గోరంతయైన
సలిలమైననుగొని సత్ఫలితమ్ము
కలిగించుకొండంత కరుణామయుండు
హరిపూజ సలిపెడి హస్తమ్మె ఘనము
మరువక హరిగొల్చు మనసన్న ధనము
శక్తివంచనలేక శౌరిని గొలువ
భక్తికి మెచ్చును భగవంతుడెపుడు
మధురలోనిసుదాము మాల లందుకొని
వ్యధలేని జీవిక వరముగనిచ్చె
సాలెవానికడ వస్త్రముగై కొనియు
చాలబలము కీర్తి సంపదలిచ్చె
చందన మలదగచక్కగకుబ్జ
సుందర రూపము సుదతికి నిచ్చె
పండ్లు సమర్పించ పడతికిని హరి
పండ్లన్నిరతనాల పంటగ జేసె
అర్పణచేయుట అల్పమెయైన
దర్పము లేకున్నదైవమ్ముమెచ్చు
అంకిత బుద్ధిని ఆత్మశుద్ధిగను
సంకట హరణుని శరణన్నచాలు
ఒంటరితనమున ఓదార్పునిడుచు
కంటికి రెప్పలా కాపాడునుహరి
వేణువు నాపేరు వేయివిధముల
వేణుగోపాలుని వినుతింతునెపుడు

# నరకాసురవధ

మిత్రత్వమునహరి మేలును జేయు
శత్రుత్వమునహరి శరము సంధించు
గోపాలకృష్ణుని గోరంతదయను
ఆపదలెడబాయు ఆనందమెదవు
సుందరసుకుమార సుమనోహరుండు
అందీయందక కృష్ణుడలరించుచుండు
తరచిచూడ హరి నత్తరిని మరిమరి
విరియును మది వెల్లివిరియును ముదము
దనుజసంహారి యాదామోదరుండు
ఘననరకాసురు కావరమణిచె
ఆయుదంతమ్మును అవధరించుమిక
ఆయదుసుతుని శౌర్యమ్మునుగనుము
నరకాసురుడను నయవంచకుండు
వరగర్వమెల్లరవధియించుచుండె
సురలను, మునులను, సుదతులగూడ
వరుసగ బాధించు వక్రగతుండు
భూదేవి కాతడు పుత్రుడైయుండి
ఏదేని ఘోరమ్ము నెటులైనజేయు
కాలుదువ్వుచుతానుకజ్జములాడు
స్త్రీలను చెరబట్టుచెడువర్తనుండు
కడకుతెచ్చె నదితి కర్ణకుండలము
విడువక నెల్లరవైరమ్మునుండు
నరకుని చెరలోని నారీమణులును

కరుణించ వేడిరి కడుదీనముగను
"మాయావినోదుడ మానసచోర
సాయము చేయుము సంకటహరణ
మామానినీగణ మర్థింతుమయ్య
మామాన ప్రాణముల్ మరికావవయ్య
అరుదెంచు వేగమె అనిరుద్ధయనుచు"
హరిని ప్రార్థించిరి అబలలార్తిగను
వారిని బ్రోవగ వారి వారంత
వారిజుక్షుని జేరివరమీయమనిరి
చిరునవ్వు మోమున చెదరనీయకనె
నరకుని దునుముటెన్యాయమ్మనెహరి
ఎదలోని భావాలు ఎదుటివారికిని
వదనమున చదువ వలను కాదెపుడు
నిండుగాంభీర్యము నిగ్రహశక్తి
మెండుగ సహనమ్ము మేలగు మూర్తి
ఆగ్రహమ్మునను గ్రహమ్మును చక్రి
ఆగ్రీవమున జూపుఅసమాన ప్రతిభ
తొలుతనుతానంత తొణుకకయుండు
అలుకను చూపించు అంత్యమునందు
తప్పులుక్షమియించు తానులెక్కించి
తప్పిన ధర్మము, తప్పుదుశిక్ష
ధర్మపరులనెల్ల దయను కాపాడు
దుర్మదాంధుల హరిదునుముచునుండు



దనుజుడు నరకుడ ధర్మపరునిగ
తనశిక్ష వేయగ తలచెనుహరి
మదినెంచి వధియించ మాధవుడంత
కదలెను ముందుకు కదనరంగమును
రక్కసు జంపగరయమునజనెడు
అక్కమలాక్షుని అరయుచు సత్య
నరకాసురుని తానె నరుకుదుననుచు
స్థిరముగ పలికెను శ్రీకృష్ణుతోడ
రక్కసు చెరనున్న రమణులతలచి
ఒక్కసారిగ సత్యఓర్పుకోల్పోయె
నరకుని చంపుటె న్యాయమ్మనుచును
కరకుగ చెప్పెనాకలికికినుకను
అబలలబలిగొను అసురుని దునుము
సబలయెతానంచు సత్యవాదించె
పీడిత పడతుల ప్రియ బాంధవిగను
తోడుగ నిలిచెద ద్రోహినిద్రుంచ
ప్రమదలందరికి ప్రతినిధియగుచు
సమరము సాగింతుచక్కగ ననియె
"సైనికగర్జనల్ సైపగలేవు
కానరావచ్చుట కలహంసరవళి
మత్తెక్కుతుమ్మెదల్ మరియుండ వచట
మత్తేభఘీంకార మవియె విన్పించు
అరవులు విన్నంత హడలి పోయెదవు
మరణమ్ములను జూడమతి పోవునీకు

అశ్వదళము రేపు అత్యంత ధూళి
విశ్వసించుము నన్నువినుము నామాట
రణరంగమున నీకు రభసయుతగదు
క్షణమునిలువలేవు కలికి రోసీవు
కాంతునిసేవించు కాంతయెఘనము
శాంతము వహియించు
జగడమువలదు
కుసుమకోమల గాత్రికోపమ్మువలదు
అసురలచంపుట ఆటకాబోదు
కదనరంగమ్మున కాలూని నిలువ
అదనౌన? అనిజేయ అతివకుతగున?"
మభ్యపెట్టుచు సత్యమనసుమార్చంగ
అభ్యంతరము జెప్పె హరియును సతికి
నచ్చచెప్పగ జూచె నారాయణుండు
వచ్చితీరెదనంచు వనిత రెట్టించె
ఏమి చెప్పిన కృష్ణుడెటుల చెప్పినను
భామ వినక వెన్క బయలు దేరె నిక
తనమాట పైనిల్చె తరుణియాసత్య
వినతాసుతుడు తన విధితానుజేసె
ఖగవాహమ్మునగగన మార్గమున
ధగధగమనుచును తరలిరి వారు
గగనగమనమున ఘనశక్తి జూపి
ఖగవాహనమ్ముగ గరుడుడు నొప్పె
జయము గోరుచువచ్చు సత్యను గూడి

పయనమాయెనుజగపతియునవ్వుచును
సతిగాంచుచుండంగ సమరమ్ము చక్రి
అతిభయంకరముగ అవలీలజేసె
సాహసమ్ముగ పతిసాహచర్యమున
ఆహవముకురికె ఆసత్యభామ
తనకు తానుగ ధను:ధారిణియగుచు
ఎనలేని ప్రజ్ఞను ఎలనాగ జూపె
ఒక కంట రౌద్రమ్ము నొకకంటమమత
సకలచాతుర్యము చక్కగ తెలిపె
వీరనారిగసత్యవింటినారినట
ఆరక్కసుని గుండె లదరంగజేసె
ఆటపాటల గూడ అలసిపోయెడిది
వేటాడ వనముకు వెడలనట్టిదియు
ఆనిశా చరునిపైఅతిలాఘవముగ
అనిశిత శరము లతిగసంధించె
పతిదెస క్రీగంటపరికించి చూసి
సతిసత్యవేసెను శరసహస్రములు
వీణను మీటిన వేలు నొప్పునెడు
జాణ బాణమువేసె జాణతనమ్ము
గురిచూసి మరిమరి గూల్చనత్తరిని
శరపరం పరలను సమకట్టెను హరి
ఇరువురకుత్సాహ మిను మడించంగ
నరకుడు గూలెను నారాయణనుచు!
భూదేవి యంశను బుట్టెనాసత్య

ఆదైత్యుడుసుతుడు అవనిమాతకును
దనుజసంహారమ్ము తదుపరిహరియు
అనునయించెను తనఅర్ధాంగినపుడు
నరకుని మరణము నగరున తెలిసి
పరుగున జేరిరి ప్రజలంత గూడి
అసురపీడతొలగ అమరులు మునులు
మసలిరి నిశ్చింత మాధవుకృపను
నరకుని చెరలోని నారీమణులును
హరిని వేడుకొనిరి అత్యంతభక్తి
నందకిషోరుడు నరకుని నుండి
పందలు వేలుగ వనితల బ్రోచె
వారినెల్లరను వివాహమాడగను
వారిజాక్షులు కోరవాసుదేవుడిని
యదుసూనుడంత కల్యాణమాడెనట
పదహారు వేలున్నపడతులందరిని
అన్నుల మిన్నలకన్ని కాలముల
కన్నుల పండుగకావించు చుండు
తలకొకకృష్ణుని తరుణులుగాంచ
అలరజేసి రివారు అధికపుణ్యమును
ఆదానవుని బాధ హరితొలిగించ
ఓదార్పు పొందిరి ఒక్కొక్కరునిక
ఆపద బాయగనందరుగూడి
శాపము బాసిన చందమ్ము నైరి
శాపవిముక్తిని శౌరిని గొల్చి



దీపము ల్వెలిగించి దేముడంచనిరి
జగమంతపండుగ జరుపుకొనగను
సగరమయ్యెజనుల సంబరమ్మపుడు
దివ్యముగ నావాసు దేవునిదయను
సవ్యముగు బ్రతుకులు సాగించె జనులు
దుష్టుల శిక్షించి దోషమ్ముబాపు
శిష్టులరక్షించు శ్రీకృష్ణుడెపుడు
అరసినిర్మలమైన అంతంకరణను
స్థిరవాసముండును శ్రీహరియెపుడు
అకళంక భక్తితో ఆపరీక్షిత్తు
శుకముని చెప్పగ శ్రోతగ నేడద
వెతతీరగవిను చువెన్నుని కథలు
నతులిడె తేడును నారాయణునకు
మితిలేని భక్తితో మిత్తినెరిగియు
స్తుతియొనర్చెనందసుతుడెంద మందు
నరకుని వధియించినందనవనము
అరిగెను కృష్ణుడు అర్ధాంగితోడ



అమరలోకమ్మున అపురూపమైన
సుమపారిజాతమ్ము సుదతికోరగను
కుసుమకోమలి సత్యకోర్కెతీర్చంగ
వసుధకుచేర్చెను వృక్షమునతడు
పారిజాతతరువు భార్యామణికిని
వారిజనేత్రుండు వరముగనిచ్చె
అదితికుండలములు అదితికందించె
మదిలోన దీవించెదమాధువునామె
దేవేరితో గూడి దేవేంద్రుడపుడు
ఆవాసుదేవుని అర్చించినాడు
పిల్లన గ్రోవిని ప్రీతిగ చెపుదు
నల్లనయ్యకథలు నాభాగ్యమనుచు
వెదురుని కృష్ణుని వేణువు నైతి
పదనిస రాగాలు పలికించుచుంటి
వేణువునాపేరువేలరాగాల
బాణీలవినిపింతు భాగవతమ్ము

# శ్రీ కృష్ణతత్వము - చైతన్యము

పాలలోనను నీరు పదిలమ్మునుండు
రాలలో నొదిగుండు రతనాలు గూడ
పాలునీరును వేరరచుహంసకును
రాలలో నేరును రతనాలనుహరి
వేలాది మందిలో వేరు సజ్జనులు
కాలాను గుణమున కాపాడు వారి
ధూమమ్ము అగ్నినిధూళియద్దమును
కామమ్ము జ్ఞానమున్ కప్పుచునుండు
కామమ్ము మూలము, కాయమ్ము, మనసు
ఆమనో ధర్మము నరికట్టినంత
మానావమాన సమాన దృక్పధమను
జ్ఞానమువై రాగ్యసంపదల్ కలుగు
ఆత్మస్వరూపమెయగును దేహమ్ము
ఆత్మయుపరమాత్మ అగునొక్కటిగను
కృష్ణుడు  సృష్టికి నెల్లకారకుడు
కృష్ణచైతన్య మెకృషికి సాధనము
కృష్ణార్పణంబుగ కృషి చేయతగును
కృష్ణస్మరణమున కృపనొందవలెను
వదనమగ్నియును నవనిపాదమగును
అదనునాదిత్యుండు హరికినక్షియగు
నాభియై యొప్పునునభము దిక్కులగు
శోభిత శ్రవణముల్ సురలుభుజములు
వాయువు ప్రాణమువార్నిధికుక్షి

ఆయనరోమముల్ జౌషధులగును
అస్థినఖమ్ములు హరికొనుగిరులు
సుస్థిర జగతికిసూత్రధారిహరి!
శ్రద్ధగకృష్ణుని చరణసన్నిధిని
బుద్ధినిలకడగ పూజించవలెను
భాగవతపురాణఫల సారమంత
వేగ మాస్వాదించవిశదమౌ హరియు
భగవంతునకుమరి భక్తుని మధ్య
తగురీతి సత్సంబంధమ్మును కలుగు
భక్తుని కరుణించిపరమాత్మయపుడు
ముక్తిమార్గముజూపు ముఖ్యమ్ము అనుచు
కడలిని నదులెన్ని కలిసినగాని
విడకనిర్మలముగ విధినిర్వహించు
ఎన్నిసంగతులెద నిమిడినజ్ఞాని
అన్నిట వీడదు ఆత్మని నికష్ట
పరిపరి రీతుల పరుగిడు మనసు
ఆరికట్టి ప్రార్థించ హరిమెచ్చునెపుడు
ఇంద్రియనిగ్రహమ్మీశుని గొలువ
సంద్రమంతకరుణ శౌరిచూపించు
అంతట నుండును ఆకాశమనగ
అంతులేనట్టి శూన్యమదియె యగును
రవి చంద్రులు వెలుగు రాజిల్లునభము
భువిప్రతి బింబించుపూర్ణజలమున



సర్వత్ర నిండిన సర్వేశ్వరుండు
సర్వాత్మకంబునై సహజమ్మునుండు
కల్మషమన్నదికనరాని మదికి
గుల్మము యేర్పడు కృష్ణుని దరికి
కష్టసమయముల కాచెదననుచు
స్పష్టము చేయును సర్వోపగతుడు
దిక్కునీవనినమ్మిదేవునివేడ
ఇక్కటులను బాపు నీశుడువేగ
ఆపద బాపగ అర్థించినంత
ద్రౌపది మానము దయను రక్షించె
రాణివాసమునుండి రమణిద్రౌపదిని
వేణిపట్టియుతెచ్చి వేడుక జూడ
దుష్టచతుష్టయ దుర్మదాంధులకు
కష్టనష్టమ్ములు కలుగజేసెహరి
కౌరవులందరు కన్నయ్య కృపకు
దూరులై అనిజేయ దుర్బలులైరి
అసువులు బాసిరి అపజయమొంది
వసుధపాలనపాండవ పరము నయ్యె
పాండవుల్ పొందిరి భక్తిగ గొల్చి
తాండవకృష్ణుని దయనపారముగ
జననమరణములు జనులకు పెట్టి
తనువుశాశ్వతముకాదని తెలిపెహరి
వికలమనస్కుడై వినుతేని గాంచి
శుకమహర్షిపలికె శుభగాత్రమలర

భాగవతామృత భావమ్ము చెప్పి
రాగముద్వేషమురాజా తగవనె
జీవుడు మరణము చెందుటయనగ
జీవుడు విడుచుటెజీర్ణవస్త్రమును
స్వంతముకానిది స్వదేహమనగ
అంతములేనిది ఆత్మయనబడు
మట్టిలోననుబుట్టి మట్టినె జేరు
అట్టిఘటమె మేను అనుచునెరుంగు
దైవమందునె బుట్టిదైవమ్ము జేరు
జీవుడని తెలియుస్థిరముగమనకు
ఆఫలము బలము అరయుభాగ్యమ్ము
సాఫల్యమంత్రము జన్మజన్మలకు
మోహము వీడుము మోక్షముకోరి
దేహము వీడుము దేవుని జేర
సకలనిర్ణయమును సర్వేశునిదని
శుకముని చెప్పెను సూక్ష్మసూత్రమును
భక్తిగ విని తేడు భాగవతమును
ముక్తి పొందెను విష్ణుమూర్తిని తలచి
హరి గూర్చి విశదమ్మె ఆవిజ్ఞులకును
హరినామమహిమమ్ము అరయరజ్ఞులును
హరినామ జపమునె అభిలషించనగు
హరికథలు వినుట అతిమధురమగు
కృష్ణలీలాసుధ ప్రియమారగ్రోల
కృష్ణచైతన్యము కృపనుసిద్ధించు

ఎంతచెప్పిన గూఢమ్యింకను మిగులు
కొంతయు తీరకకొ్రవడు తృప్తి
అష్టసతులయందు ఆత్మజుల నంది
ఇష్టసఖుండయ్యెఇల్లాళ్ళకుహరి
పదిమందితనయుల బడసె నొక్కొకరు
ముదమంది కృష్ణుడు ముద్దారబెంచె
ఓర్పుగ పెంచెను ఒక్కొక్కయింతి
నేర్పుగ సుతులను నిండు ప్రేమమెయి
పుత్రులు పౌత్రులు పురుషోత్తమునకు
చిత్రమై దోచుమించెను కోటి సంఖ్య
పుట్టుక మొదలిడి పుత్రులవరకు
పట్టుదలగ కృష్ణపరమాత్మ కథలు
శక్తివంచన లేక జాగరూకతను
భక్తిగ వేణువై పలికితినిపుడు
ఉపచారములు మెచ్చి ఉద్ధరించుహరి
తపమాచరించిన దర్శనంబిడును
భగవానుడువశుడు భక్తి భావనకు
జగమంతనిండును జగపతిమహిమ
మర్మమెరుగనట్టి మనసున్నచాలు
కర్మయోగ మెరుక, కలిగున్నమేలు
కలవరమన్నది కానరాదెపుడు
తొలగును మాయయు దొరకును సిద్ధి
ధర్మసూత్రమ్మును ధరనెల్లరకును
కర్మసిద్ధాంతముగరపెను శుకుడు

పరమార్థపరమైనపరమాత్మలీల
శరణార్థుల కిడునుచక్కని త్రోవ
విన్నవారికి హరివిభవమ్మునిచ్చు
అన్నియు నెరిగించి ఆశీర్వదించు
చిత్తశుద్ధిని హరిసేవచేయంగ
ఉత్తమ గతులుండు ఉర్వీజనులకు
తిరుగులేనంతటి త్రికరణశుద్ధి
ఒరులకు చేసెడి ఉపకారబుద్ధి
భక్తియును కలిగి భగవాను గొలువ
ముక్తియె నిలుచును ముంగిటమనకు
దక్షునజామీళు దయజూచెహరియు
పక్షపాతములేదుభక్తులయందు
నారాయణుని చరణస్మరణమ్మె
వారాసిదాటించు వారధియగును
మాధవుగాథల మధురిమగ్రోల
బాధలమరతురు బాగుగప్రజలు
ప్రతిఫలాపేక్షతో పనిచేయ తగదు
ప్రతిదినముతలచు పరులకు మేలు
అన్నిదానమ్ముల అన్నదానమ్ము
మిన్నగవెన్నుడు మెచ్చునెన్నడును
మానవ సేవకు మాధవుండలరి
మాననీయంబగుమనుగడ నొసగు
నీసేవలుండిన నిష్కామముగను
నీసేమమరయును నిక్కముగహరి



కృష్ణలీలామృతం కృపనందజేసి
కృష్ణావీతారిమై కీర్తిగడించె
మురళీరవమ్మునుముద్దుగ నేర్పె
వరమైన భక్తితత్వమ్మునుచక్రి
గోపికలవరము గోపాలుమురళి
ఆపార్థుని వరము ఆగీతబోధ
మురళియు, గీతయు మోక్షగాములకు
తరియింప జేయు సాధనమననిజము
నరుడైన విష్ణువు నగధరునిగను
బరువంత తనదని బ్రతుకుమీదనియె
భారమువహియించి భక్తులబ్రోచి
సారము నెరిగించి సంస్కరించుహరి
నాదమునెల్లర నారాయణుండు

వేదసారమునంత వివరించుచుండు
వేణునాదమ్మున వేల్పుల, నరుల
వేణుగోపాలుడు వేదనతీర్చు
శంకు నాదమ్మున శత్రుగుండియల
శంకయు భీతియు శౌరికల్గించు
హరిపాంచజన్యము ఆజిపూరించి
హరియించి అసువుల అసురులనణచు
నాదమ్ము తీర్చును నరుల ఖేదమ్ము
నాదమ్మె గూర్చును న్యాయమెల్లరకు
వేణుగానమునకు వివశులైనట్టి
ప్రాణులు పరమాత్మపదముగోరుదురు
వ్యత్యస్త పాదుడు వరమిచ్చిబ్రోచు
అత్యాదరమ్ముగ ఆభక్తువరుల

